# గురు ప్రబోధ సుధాలహరి



# గురు స్తోత్ర సుమాంజలి

రచన, భావానువాదం :

భాగవతి రామమోహనరావు

ప్రకాశకులు
జ్ఞాన వికాస్ పబ్లికేషన్స్
210-3 ఆర్.టి. విజయనగర్‌కాలని
హైదరాబాదు

ప్రథమ ముద్రణము - 1000

పుస్తకములు దొరకుచోటు :

జ్ఞాన వికాస్ ప్రచురణలు,

210-3-R.T, విజయనగర్ కాలని,

హైదరాబాదు - 500 457

(ఫోను : 37628)

ముద్రణ :

ప్రసాద్ గ్రాఫిక్స్

3-6-115/5, హైదర్‌గూడ,

హైదరాబాద్ - 500 029.

కవర్ పేజి :

సత్యసాయి డిజైనింగ్ స్టుడియోస్

రెడ్‌హిల్స్, హైదరాబాద్, ఫోను - 37443

మూల్యము : రూ.

# ప్రకాశకుల ఆకాంక్ష

యదార్థ భగవత్తత్వానికి మూలకందమైన ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు, యోగవాశిష్టము, భగవద్గీత మొదలైన విశిష్ట ఆధ్యాత్మిక గ్రంథాల ఆధారంగా ఈ చిన్న పుస్తకం రచించబడింది. దీనిలో మొదట నిజమైన ఆధ్యాత్మిక గురువుని గురించి వివరించి, అటువంటి తత్వజ్ఞాన శోభితుడైన సద్గురుమహనీయుని బోధ ఏ విధంగా కొనసాగుంతుందో గురు శిష్య సంభాషణ క్రమంలో చెప్పబడింది. ఇందులో అసలైన భగవత్తత్వం, మాయాస్వరూపం, అజ్ఞాన అహంకారాల నివృత్తి మార్గం, ఆత్మజ్ఞానాన్ని వికసింపజేసే ఉత్తమ సాధనాక్రమం, సవికల్ప, నిర్వికల్పసమాధి విధానాలు, నిధిధ్యాస అనబడే తత్వ విచార సాధనా మార్గము మొదలైన ఆధ్యాత్మికాంశాలు సూక్ష్మంగా, అందరికీ అవగాహన అయేలా వివరించబడ్డాయి.

పూజ్యపాదులైన సద్గురువులను గురించిన పవిత్ర ప్రార్థనా శ్లోకాలు భావాను వాదాలతో "గురుస్తోత్ర సుమాంజలి" అనే శీర్షికలో వెలువడ్డాయి.

ఆత్మ జిజ్ఞాసులకు, ముముక్షువులైన ఉత్తమ ఆధ్యాత్మికసాధకులకు ఈ పవిత్ర గ్రంథం ఎంతో తోడ్పడగలదని ప్రకాశకుల ఆకాంక్ష.

హైదరాబాదు,

ఇట్లు

ప్రకాశకులు

# విషయ సూచిక

ఓం

పేజి నెం.

# గురువు

1

## గురుని లక్షణాలు -- గురుని ఆవశ్యకత

నిజమైన గురువెవరో, ఆ సద్గురు మహానీయుడు ఎటువంటి లక్షణాలు కలిగి వుంటాడో తెలుసుకోవడం ఆత్మజిజ్ఞాసులంద రికీ ఆవశ్యకరం. ముముక్షువులైన ఆధ్యాత్మిక సాధకులకు ఎంతో

13

శ్రేయస్కరం.

గురు అనే పదానికి అర్థం, వేదాంత శాస్త్రరీత్యా, ఈ విధంగా చెప్పబడింది:-

55

గుకారస్త్వంధకారస్య రుకారో తన్నిరోధకః |
అంధకార నిరోధిత్వం గురు రిత్యభిధీయతే||

"గు" అనే పదం అంధకారాన్ని సూచించేదని, "రు" అనేది దాన్ని నిరోధించేదని తెలిపే పదమని, అంధకారాన్ని నిరోధించేది గనుక, "గురు" అనేది అలా చెప్పబడిందని ఈ శ్లోకానికి తాత్పర్యం.

శిష్యుల అంధకారాన్ని నశింపజేసేవాడే గురువు. ఇక్కడ అంధకారమంటే, కటిక చీకటితో పోల్చదగిన దట్టమైన అజ్ఞానమని భావం. అది అజ్ఞానానికి అతి నికృష్టమైన పేరు. ఆధ్యాత్మిక పరిభాషలో అజ్ఞానమంటే, తన సహజ, స్వభావ, నిరతిశయ, చైతన్యానంద స్వరూపాన్ని గురించిన అనుభవ జ్ఞానం తనకి ఎంత

మాత్రం లేకపోవడం. ప్రపంచంలో ఎంతటి ఘనుడైనవాడైనా, మహామేధావియైనా, ప్రతినిత్యమూ జాగ్రత్, స్వప్న, సుషుప్తావస్థలతో మనుగడ సాగించే తానెవరో, తన నిజస్వరూపం ఏదో, జననమరణాదులతో గోచరించే అనిత్యమైన ఈ జీవిత ప్రపంచాదుల యదార్థమేమో ఏమీ తెలియని అజ్ఞానంలోనే ఉంటున్నాడు. జడ పదార్థనిర్మితమై, ఎప్పుడైనా నశించిపోయే అనిత్యమైన శరీరమే తన స్వరూపమనుకుంటూ, దేహాత్మబుద్ధితో అహంకాపరుడై వున్నాడు. ఈ అహంకార సంకుచిత భావమే అజ్ఞానబీజం. దీనివల్లే తన సహజ, స్వభావ, స్వరూప చైతన్యానుభవం తనకి మరుగైవుంది. తనకిపుడున్న ఈ దేహాత్మభావాన్ని ఆత్మజ్ఞాన ప్రబోధాలతో నశింపజేస్తూ, అజ్ఞానపు అడ్డుతెరను తొలగించి, తన యదార్థ చైతన్యస్వరూపమైన ఆత్మానంద వైభవాన్ని అనుభూతి చెందడానికి సరియైన, సక్రమమైన మార్గం చూపిస్తూ, తనకు తోట్పడేవాడే నిజమైన గురువు. అటువంటి సద్గురు మహనీయుడు ఎంతో అరుదుగా, ఎక్కడో మరుగున వుంటాడు.

గురువనే మహనీయుడు సాధకుల అజ్ఞానాన్ని పోగొట్టే సమర్థత కలవాడై వుండాలికదా! అటువంటి సమర్థత ఎవరికుంటుందో గమనించడం అవసరం. సాధన సంపత్తితో ఆత్మానుభవజ్ఞులైన ప్రబుద్ధులు, తత్త్వవేత్తలైన బ్రహ్మజ్ఞాన శోభితులు మాత్రమే సాధకుల అజ్ఞానాన్ని నిర్మూలించే సామర్థ్యం కలిగివుంటారని వేదాంత శాస్త్రాలు విశదపరుస్తున్నాయి. ఆత్మానుభవంలేక, కేవలం వేదాంత శాస్త్రపరమైన పాండిత్య ప్రతిభను గడించిన పండితులకు ఆ సామర్థ్యం సంభవించదు. దీన్నిగురించి, కఠోపనిషత్తులో యమధర్మరాజు నచికేతునికి ఈవిధంగా విశదపరుస్తాడు:-

నవరేణా వరేణ ప్రోక్త ఏష
సువిజ్ఞేయో బహుదా చింత్యమానః,

అనన్యప్రోక్తే గతి రత్ర నాస్తి
అణీయాన్ హ్యతర్క్య మణుప్రమాణాత్||

అంటే, ఆత్మానుభవజ్ఞులు తప్ప ఇతర వ్యక్తులెవరూ (ఎంత పండితులైనా) ఆత్మతత్త్వాన్ని ఉపదేశించడానికి అర్హులు అవరు. అర్హతలేని వారు చేసే ఉపదేశాలు, బోధలు, నిష్ప్రయోజనాలై, వాటివల్ల ఉపదేశికులకు ఆత్మతత్త్వం ఎంతమాత్రం అవగాహన అవదు. బ్రహ్మానుభవ జ్ఞానియైన మహనీయుని ఉపదేశం, సరళంగా, సంశయరహితంగా, ఆత్మతత్త్వాన్ని విశదపరుస్తుంది. ఆ పరతత్త్వం అతి సూక్ష్మాతి సూక్ష్మమైంది కనుక, అది కేవలం తర్కంవల్ల కాని, ఊహలచేగాని గ్రహింపబడేది కాదు.

తత్త్వజ్ఞాన శోభితుడైన వాడే, భగవత్తత్వాన్ని సాధకులకు సవ్యంగా, సరళంగా, సంశయరహితంగా గ్రాహ్యపరచి, వారి అజ్ఞానాన్ని పోగొట్టగల సమర్థుడని, అటువంటి మహనీయుడే సద్గురువని వేదాంత శాస్త్రాలు ఇలా వ్యక్త పరుస్తున్నాయి.

సాధారణంగా, ఈ రోజుల్లో, ఆశ్రమాల్లోను, మఠాలలోను, మందిరాల్లోను వుండే స్వాములందరినీ గురువులుగా భావించడం అపోహ అవుతుంది. వారిలో కొంతమంది సన్యాసవేషధారులు, మఠాధిపతులు, వేదాంత శాస్త్రజ్ఞాన కోవిదులైన పండితులు కూడా వుండవచ్చు. అటువంటి వారినందరినీ, వారి ఇతర లక్షణాల్ని పరిశీలించకుండా గురువులుగా పరిగణించడం చివరికి పొరపాటుగా పరిణమిస్తుంది.

కొందరు స్వాములు, బాబాలు వారు సంపాదించిన యోగశక్తుల్ని, మంత్రశక్తుల్ని ప్రదర్శిస్తూ, ప్రజల్ని విభ్రాంతుల్ని చేస్తూండడం అందరూ ఎరుగున్నదే. అలాటి శక్తులు అవిద్యామయమైనవని నిరసిస్తూ, ఆత్మజ్ఞానానికీ, ముక్తిపొందడానికీ వాటితో ప్రమేయంలేదని, ఆ శక్తుల్ని ప్రశంసించడం, అభిలక్షించడం, ఆత్మజిజ్ఞాసులకు

యోగ్యంకాదని వేదాంతశాస్త్రాలు విపులంగా స్పష్టం చేస్తున్నాయి. కనుక, ముముక్షువులైన ఉత్తమ ఆధ్యాత్మిక సాధకులు అటువంటివాటిని అప్రధానమైనవని గ్రహించుకోవాలి. దుష్టులు, దుర్మార్గులు అయిన రావణుడు, ఇంద్రజిత్తువంటి రాక్షసులు కూడా ఎన్నో అద్భుతమైన శక్తుల్ని ప్రయోగించడం మన పురాణాలు తెలియజేస్తున్నాయి. మారీచుడు బంగారపు లేడిగా మారి అరణ్యంలో శ్రీరామచంద్రుని పర్ణశాలదగ్గర పర్యటించడం ఎటువంటి అద్భుతమైన శక్తి ప్రదర్శన? తాటకి, శూర్పణక వంటి రాక్షస స్త్రీలుకూడా అనేక అద్భుత శక్తులని ప్రదర్శించారు. ఇలాటి శక్తులన్నీ మిథ్యాస్వరూపమైన భౌతిక ప్రపంచానికి సంబంధించినవి. ఆత్మజ్ఞాన సంపన్నులైన సద్గురు మహానీయులు అటువంటివాటికి అతీతులైవుంటారు. వారి దృక్పథంలో అవిద్యామయమైన అవన్నీ యదార్థంగా ఉనికీ, విలువాలేని అసత్యమైనవి. స్వప్నదృశ్యాలకి ఎంతటి విలువ వుంటుందో వీటికీ అంతే.

కొందరు స్వాములు ప్రజోపకారార్థమని ధర్మప్రచారాలు చేస్తూ, యజ్ఞయాగాది క్రతువులు, అన్నదానాది కార్యక్రమాలు చేయిస్తూం టారు. ఈ సందర్భంలో అతి ముఖ్యమైన ఒక విషయాన్ని గ్రహించుకోవడం ఉత్తమ అధ్యాత్మిక సాధకులకి ఎంతో అవసరం. ధర్మార్థ కామమోక్షాలనే చతుర్విధ పురుషార్థాలలో, మొదటి మూడూ వదలి పెట్టి, నాల్గవదైన మోక్షపదాన్ని మాత్రం కోరే వాడే ఉత్తమమైన ముముక్షువు. మోక్షం ప్రపంచ రహితమైనది. మనోతీతమైనది. ప్రపంచరహిత స్వస్వరూపాత్మ స్ఫురణమే మోక్షం. ధర్మా ధర్మాలు, పుణ్య పాపాలు మొదలైన ద్వైత భావాలతో గాని, యజ్ఞయాగాదులు, సంఘసేవలు లాంటి కార్యకలాపాలతోకాని, ఆత్మతత్త్వానికి ప్రమేయంలేదు. ధర్మ ప్రబోధాలు చేసేవారు సంఘాన్ని సంస్కరించి, ప్రజలు సన్మార్గంలో జీవించడానికి తోడ్పడే లౌకిక గురువులౌతారు. అటువంటి వారివల్ల ప్రజలకు చేకూరే ప్రయోజనం మహోన్నతమైందే అవుతుంది. అయితే, ఆత్మజ్ఞాన

సంపన్నులు, తత్వవేత్తలు అయిన సద్గురువుల దృష్టిలో కేవలం మిథ్యా స్వరూపము, సర్వాబద్ధము అయిన ప్రపంచంలో ధర్మం, అధర్మం, పుణ్యం, పాపం, మంచి, చెడు లాంటి ద్వంద్వభావాలన్నీ స్వప్నతుల్యమైనవి కనుక, వృథా జల్పనాలే అవుతాయి. కనుక, నిజమైన గురువెవరో గుర్తించుకోడానికి, అటువంటి గరుమహనీయుడు ఏ లక్షణాలు కలిగివుంటాడో తెలుసుకోవడం ఎంతో ముఖ్యం.

## నిజమైన సద్గురుని లక్షణాలు:-

సర్వకాల సర్వావస్థలయందూ ఆత్మనిష్ఠయందుండువాడే సద్గురువని మన వేదాంత శాస్త్రాలు విశదపరుస్తున్నాయి. భగవాన్ రమణమహర్షి వారి ప్రబోధాలలో గురువుని గురించి ఈ విధంగానే వ్యక్తం చేశారు. ఆత్మనిష్ఠ అంటే దేహభ్రాంతిని (దేహాత్మబుద్ధిని) వొదుల్చుకున్నవాడై, జనన మరణాదులతో కూడిన దృశ్య ప్రపంచం యొక్క మాయాస్వరూపాన్ని అనుభవ జ్ఞానంతో అవగాహన చేసుకున్న వాడని అర్థం. అలా అవగాహన చేసుకున్న మహనీయుడు, తన సహజ, స్వభావ, స్వరూపమైన ఆత్మనిష్ఠలోనే ఎల్లప్పుడూ, నిరతిశయానందంతో ఓలలాడుతూ ఉంటాడు. అటువంటి సద్గురు మూర్తికి - తాను, ఇతరులు అనే భేదబుద్ధి ఉండదు. తాను గురువునని, గొప్పవాడన' ఉత్తముడనని, ముక్తుడనని, ఇతరులందరూ, అజ్ఞానంతో ? సంసార బద్ధులై వున్నారని అతనికి తోచదు. ఆయనకు శిష్య ద్వంద్వభావమే వుండదు. వారి దృష్టిలో అందరూ సమ్ముల్ల, ఉన్నదంతా ఏకైక భగవత్ స్వరూపమై భాసిస్తూంటుంది. ఆయన దేనినీ ఆశించరు. దేనినీ ద్వేషించరు. పేరు ప్రతిష్ఠలను, కీర్తినీ అసలే కాంక్షించరు.స్తుతులను, సన్మానాలను సహించరు. ఆయన దృష్టిలో అటువంటివన్నీ వట్టి మిథ్యాస్వరూపమైన భౌతిక జగత్తుకు సంబందించిన అర్థరహిత కార్యకలాపాలు.

అసలైన సద్గురు మూర్తి ఎప్పుడూ ఏకాంతంగా, మౌనంగా

వుంటాడు. మౌనమంటే ఆత్మనిష్ఠ. సర్వకాల సర్వావస్థల లోనూ స్వస్వరూపానందానుభవంలో వుండటం. ఇలాటి మహనీయుడు బహిరంగోపన్యాసాలలోనూ, ఇతర కార్యకలాపాలలోనూ ఎన్నడూ పాల్గొనడు. ఆ మహనీయుడికి బహిరంగంగా ప్రపంచమనేది ఎక్కడా లేదు కదా! ఉన్నదంతా తానే. రాగద్వేష రహితుడై స్థాణువువలె నిశ్చలంగా వుంటాడు. ఎవరైనా అర్హతగల ముముక్షువులు బ్రహ్మజ్ఞాన సంబంధమైన అంశాలని గురించి, సందేహనివారణార్థం ఏవైనా ప్రశ్నలు వేస్తే, వారికి ఉపయోగకరమైన సమాధానాలను చెబుతాడు.

వినయ విధేయతలతో, తనను శరణు జొచ్చిన శిష్యులను విడువకుండా, వారిని అజ్ఞానమయమైన సంసారసాగరంనుంచి ఉద్ధరించేవాడు, శిష్యుడు చెప్పలేని దానిని కూడా తాను గ్రహించి, బోధానుకూల యుక్తులతో, శిష్యుల అజ్ఞానాన్ని తొలగించి, వారికి జ్ఞానోదయం కలిగించేవాడు. అర్హులైన వారి దుఃఖాలను, క్లేశాలను అనుగ్రహ దృష్టితో తొలగించడానికి పూనుకునే వాడు సద్గురువని వేదాంతశాస్త్రాల్లో వివరించబడింది. అలాటి సద్గురువుకి ఐహిక, ఆముష్మిక సుఖాలమీద ఎటువంటి వ్యామోహం వుండదు. తాను, ఇతరులు అనే భేదబుద్ధి వుండదు. సుఖదుఃఖాది ద్వంద్వాల పట్ల నిర్వికారుడై వుంటాడు. విషయ రహిత నిర్వాసనా దృష్టి కలిగి ఉంటాడు. ద్వేషము, డంబము, మాత్సర్యము, వంచన - ఇలాటి దుర్గుణాల అంశం కూడా ఆయనయందు పొడ చూపదు. వైదిక, విధి నిషేధాలకు అతీతుడై, అహంకార, మమకార రహితుడై, వేదాంతమహావాక్యాల తత్త్వార్థ సంబంధమైన దృష్టితో అపరోక్ష జ్ఞాన సంపన్నుడై వుంటాడు. అర్హతగల శిష్యులకు వేదాంత తత్త్వార్థాన్ని బోధించడం కంటే, ఇతరమైన లౌకిక కర్తవ్యమేదీ ఆ మహనీయునికుండదు.

గురుత్వమంటే కేవలమూ తన అభిమానానుగ్రహ దృష్టిచేతనే శిష్యుని అజ్ఞాన పరమైన మిథ్యాజ్ఞానాన్ని నశింపజేసి, బ్రహ్మజ్ఞానశక్తిని

పెంపొందింపజేసేదని యోగవాశిష్టంలో చెప్పబడింది. సద్గురువుని గురించి యోగ వాశిష్ఠంలో ఇంకా ఇలా స్పష్టం చెయ్యబడింది :

దర్శనాత్స్పర్శనా ఛబ్దాత్కృపయా శిష్యదేహకే
జనయేద్యః సమావేశం శాంభవం సహిదే శికః||

అంటే, దర్శనం వల్లా, స్పర్శచేతా, కృపాకటాక్షాలతోకూడిన ప్రబోధ వాక్యాలవల్లా శిష్యుని హృదయంలో శివజ్ఞానపరమైన ఆత్మతత్వ సమావేశాన్ని ఎవడు జనింప చెయ్యగలుగునో, అటువంటి మహనీయుడే నిజమైన సద్గురువు.

సర్వే శృణుత భద్రవో నిశ్చయేన సునిశ్చితమ్|
ఆత్మజ్ఞానాత్పరంనాస్తి గురోరపిచ తద్విదః||

ఓ జనులారా! మీకు శుభం కలుగుగాక! మీరందరూ అత్యంత నిశ్చయమైన, పరమ సత్యమైన ఈ మహత్తర విషయాన్ని వినండి; "ఆత్మజ్ఞానం కంటే, ఆత్మజ్ఞానానుభవజ్ఞుడైన సద్గురువుకంటె మించింది ఈ లోకంలో ఏదీ లేదు."

## గురుని ఆవశ్యకత:-

ఆత్మజ్ఞాన సంపన్నుడైన గురువు ముఖమున స్వ... బ్రహ్మవిద్య అభ్యసించాలని, సద్గురుని అనుభవైక ప్రబోదాలవల్ల ..., కేవలం శాస్త్రప్రమాణాలచేత నేర్చుకొన్న విద్య, జాగర గర్భంలా, ఫలప్రదంకాదని, ఆత్మ వేత్తలైన సద్గురువుల వల్ల నేర్చుకొన్న విద్యయే సుస్థిరమై ఫలప్రదమైన అధ్యాత్మిక ప్రగతిని కలుగజేస్తుందని శ్రుతులలో చెప్పబడింది. అయితే, పక్వజీవులైన కొందరు మహనీయులు ఏ గురువునూ ఆశ్రయించకుండా, సక్రమమైన, స్వకీయమైన పురష ప్రయత్నం వల్ల ఆత్మసిద్ధిని పొందడం కూడా గమనార్హం. అటువంటి వారికి వారి అంతర్యంలో వున్న పరమాత్మస్వరూపుడే గురువుగా

తోట్పడుతూ, ఆధ్యాత్మిక ప్రగతినీ, ఆత్మ జ్ఞానాన్నీ ప్రసాదిస్తూంటాడు.

సూక్ష్మంగా చెప్పాలంటే, తాను నామ రూపాలుగల శరీరుణ్ణనుకునే దేహాత్మభ్రాంతి తొలగి పోనంతవరకూ, తన్ను ఒక వ్యక్తిగా, దేహిగా తాను భావించుకొంటూన్నంతకాలమూ, తనకి గురువు అవసరమే. అలాకాక, శరీర భ్రాంతి వదలి, తాను దేహిని ఎంతమాత్రం కాదని, నిత్య సత్యాత్మ స్వరూపమైన బ్రహ్మ స్వరూపుణ్ణేనని అవగాహన అయిన మానవోత్తముడికి ఆత్మయే సద్గురువుగా భాసిస్తుంది.

వివేక, వైరాగ్య, విచారణల ద్వారా దేహాత్మబుద్ధిని ఎవరికి వారే పోగొట్టుకోగలరు. శమదమాదులు పాటిస్తూ, ఆత్మానుభవథ్యాసతో పరితపించే సాధకుడికి, చిత్తశుద్ధి కలిగి, ఆ స్వయం సాహాయతతో కూడిన శక్తి దానంతట అదే సంప్రాప్తిస్తుంది. అటువంటి వాడికి హృదయస్థలిలోనున్న ఆత్మయే గురువై తత్వవిచార సామర్థ్యాన్ని కలుగ జేస్తుంది. అలా స్వయం శక్తిని సంపాదించుకోలేని వారికి, గురు ప్రబోధాల ద్వారా ఆ శక్తిని పెంపొందించకో వలసి వుంటుంది.

కనుక, దేహాత్మ భావంతో, అజ్ఞానంలో వున్నంత కాలం, సాధకుడికి సాధన సమయంలో గురువు ఆవశ్యకమే. అజ్ఞానం నశించనంతవరకు, సాధకుడికి దేహాత్మ బుద్ధి వుంటుంది. గురుశిష్య ద్వంద్వభావం కలిగివుంటాడు. గురువును దేహిగా భావిస్తాడు. అపుడు జీవాత్మ భావుడైన శిష్యుడు, గురువుని పరమాత్మ స్వరూపునిగా భావిస్తూ ఆరాధించాలి. గురు ప్రబోధ కటాక్షాలవల్ల, తనకు దేహాత్మ భావం, జీవత్వం నశించిపోయి జ్ఞానోదయం కలుగుతే, ఇక గురు శిష్య ద్వంద్వభావం నశిస్తుంది. లక్ష్యసిద్ధికలిగి, ఆత్మానుసంధానపరుడౌతాడు. సర్వాత్మ భావం గురుశిష్య అభావంగా పరిణమిస్తుంది.

# సద్గురు ప్రార్థన

వేదాంత వాక్యపుష్పేభ్యో జ్ఞానామృత మధూత్తమ్
ఉజ్జహారాళివ ద్యో న స్తస్మై సద్గురవే నమః||

తా|| వేదాంత మహావాక్యాలనే పుష్పాల లోంచి జ్ఞానామృతమనే మకరందాన్ని సేకరించి మనకి ప్రసాదించిన భ్రమరమువంటి సద్గురువులకు నమస్కారము.

## మంగళం

మంగళం గురుదేవాయ | మహనీయ గుణాత్మనే |
సర్వలోక శరణ్యాయ | సాధురూపాయ మంగళం.|

హైదరాబాదు

ఇట్లు
భాగవతి రామమోహనరావు

# గురు ప్రార్థన

పదవాక్య ప్రమాణజ్ఞై
ర్దీపభూతైః ప్రకాశితమ్।
బ్రహ్మవేదరహస్యం యై
స్తాన్నిత్యం ప్రణతోస్మ్యహమ్॥

తా॥ వేదాంత మహావాక్య ప్రమాణాల్ని సంపూర్ణంగా తెలుసుకున్న వాడవటంవల్ల, దీపం వస్తువుల్ని ఎలా ప్రకాశింపజేస్తుందో, ఆ విధంగా వేద రహస్యమైన బ్రహ్మస్వరూపాన్ని ప్రభావితం చేసి శిష్యుడికి గోచరింపజేసే సద్గురు మహనీయుని పాద పద్మములకు సర్వదా ప్రణామములనర్పిస్తున్నాను.

ఓం

# గురు ప్రబోధ
# సుధాలహరి

వైరాగ్య సంపన్నుడు, శమ, దమాదులు పాటించుటవలన, చిత్తశుద్ధి కలిగినవాడు, పరమోత్కృష్టమైన ఆత్మతత్వాన్నిగురించి తీవ్రమైన ఆకాంక్ష కలవాడు, తత్వజ్ఞాన ప్రబోధానికి అర్హుడు అయిన ముముక్షువు, ఆత్మజ్ఞాన సంపన్నుడు, బ్రహ్మనిష్ఠాపరుడు అయిన సద్గురు మహనీయుని ఆశ్రయించి, సవినయుడై ప్రణామములనర్పించి, ఆత్మజ్ఞాన సంబంధమైన విషయాల్ని గురించి వారిని ప్రశ్నిస్తూ, తన సందేహాల్ని నివారించుకొను గురుశిష్య అన్యోన్య సంభాషణమే ఈ గురుప్రబోధ సుధాలహరి :-

**శిష్యుడు :-** స్వామీ! గురుదేవా! చిరకాలంనుంచీ శ్రద్ధాభక్తులతో అనేక సాధనలు చేస్తున్నాను. కానీ, వాటివల్ల, నాకు ఏవిధమైన అధ్యాత్మిక ప్రయోజనము, ప్రగతి కలుగలేదు. నాలో ఎటువంటి మార్పూ, పరివర్తనా పొడచూపలేదు. జనన మరణాదులతో కూడిన ఈ శరీర ప్రపంచాదుల యదార్థం నాకేమీ గ్రాహ్యమవలేదు. నేనెవరినినో, నా యదార్థ స్వరూపమేదో ఏమీ తెలియని అజ్ఞానంలోనే అవివేకుడనై వుంటున్నాను. శరీర, సాంసారిక బాధల్తో, రాగద్వేషాది

ద్వంద్వభావాలతో పీడింపబడుతూనే వున్నాను. అనేక మానసిక క్లేశాలకు, దుఃఖాలకు లోనౌతున్నాను. ఆత్మజ్ఞాన సంపన్నులైన తమర్ని గురించి తెలుసుకుని తమ సన్నిధికి వచ్చాను. మహాత్మా! నాకీ అజ్ఞానం నుంచి నివృత్తి ఏ సాధనోపాయంవల్ల కలుగుతుంది.? పరమోత్కృష్టమైన ఆత్మజ్ఞానం ఎలా సంప్రాప్తిస్తుంది? దాని విధానమేది? నన్ను కరుణించి, నాకీ విషయాన్ని గురించి వివరంగా బోధించమని ప్రార్థిస్తున్నాను.

గురువు:- ఓహో! నువ్వెవరో అదృష్టవంతుడవు. నీలో శుభేచ్ఛ జనించినట్లుంది. మాయా స్వరూపమై, ఎంతో అనిత్యమైన తమ జీవితాన్ని గురించి ఏమీ ఎరుగని అజ్ఞానంలో వుంటూ, వివేకసూన్యులై మనుగడసాగించే మానవకోటిలో నీబోటి వారెంతో అరుదు. మానవజన్మ్మడికి అధ్యాత్మికోన్నతియే సార్థక ప్రయోజనము. యదార్థమైన భగవత్తత్వాన్ని అవగాహన చేసుకుని, ఉత్తమమైన అధ్యాత్మిక సాధనని చేపట్టి, జనన మరణ సంసార చక్ర భ్రమణం నుంచి విముక్తి పొందడమే పరమ పురుషార్థము. అమూల్యమైన జీవిత కాలాన్ని వ్యర్థంగా పోగొట్టుకోక ఆత్మానుభూతి కోసం ప్రయత్నం చేసే సాధకులే నిజమైన మానవజన్ములు. అలాంటి మానవోత్తములు ఎంతో అరుదుగా వుంటారు.

శిష్యుడు:- మహాత్మా! యదార్థమైన భగవత్తత్వం ఏదో నాకు తెలియకున్నది. దయతో దానిని విశదపరచమని ప్రార్థిస్తున్నాను.

గురువు:- యదార్థమైన భగవత్తత్వాన్ని గురించి తెలుసు కోవాలని ఎంతో ఆసక్తితో వున్నావు. నువ్వెంతో ధన్యుడవు. ఉత్తమ ఆధ్యాత్మిక సాధకుడు మొట్టమొదట భగవత్తత్వాన్ని గురించి తెలుసుకోవలసిన ముఖ్యాంశం ఒకటుంది. దాన్ని ఎప్పుడూ దృష్టిలో వుంచుకోవాలి. అదేమంటే, సాధించడానికీ, పొందడానికీ సాధకుడికి అన్యమైందేదీ, ఎక్కడా లేదు. సాధకుడే భగవత్ స్వరూపుడై ఉన్నాడు.

కనుక ఏ పరమాత్మ స్వరూపాన్ని పొందాలని, సాక్షాత్కరించుకోవాలని, సాధనలు చేస్తున్నావో అది నువ్వే అయి వున్నానవని గుర్తించుకోవాలి. భగవంతుని గురించి నీలో ఇతర ఆలోచన లేవైనా వుంటే, వాటిని విడిచి పెట్టి సాధించవలసిందీ, పొందవలసిందీ నీకు భిన్నమైందేదీ ఎక్కడా లేదనే యదార్థతత్వాన్ని గ్రహించుకోవాలి.

శిష్యుడు:- స్వామీ! నేనే భగవత్ స్వరూపుడనైతే, అది నాకెందుకు అవగాహన అవటం లేదు?

గురువు:- అవును. యదార్థంగా నువ్వే పరమాత్మస్వరూపుడవై ఉంటున్నా, ఆ నిజస్వరూపం నీకు అగోచరంగానే వుంటున్నది. నిజానికి నువ్వు నిరాకార, నిష్క్రియ, నిరతిశయానంద నిలయమైన ఆత్మస్వరూపుడవు. అటువంటి దివ్యస్వరూపుడవైన నీకు, నేనీ శరీరాన్ని అనుకునే అనర్థ దాయకమైన దేహభ్రాంతి సంక్రమించింది. నామరూపాలతో, అవయవాలతో కూడియున్న దేహివిగా నిన్ను అన్వయించుకొని భ్రమించిపోతున్నావు. నీ సహజ, స్వభావ స్వరూపమైన ఆత్మను మరవడంవల్ల, ఆదివ్యానుభం నీకిప్పుడు దూరమైంది. రక్తమాంసాది జడపదార్థ నిర్మిత అవయవ సముదాయమై, నీచే తెలియబడే అనిత్యమైన ఈ శరీరం నీ నిజస్వరూపం ఎలా అవుతుంది.? వివేక బుద్ధితో, సావధాన చిత్తుడవై యోచించుకో. ఈ అపోహకంతటికీ నీ అప్రమత్తత, అజ్ఞానము కారణమని గ్రహించుకో. అజ్ఞానంవల్ల నీకు అహంకారపరమైన ఒకప్రత్యేక అబద్ధపు వ్యక్తిత్వం కలిగింది. దాంతో అసత్యమైన ఇతరాలతో కూడిన ప్రపంచభ్రాంతి సంక్రమించింది.

శిష్యుడు:- స్వామీ! గురువరా! అజ్ఞానమంటే ఏమిటో నాకు తెలియడం లేదు. నన్ననుగ్రహించి దాన్ని గురించి వివరంగా చెప్పండి.

గురువు:- అలాగే. ఉత్తమ ఆధ్యాత్మిక సాధకులు ముందుగా

తమ అజ్ఞానాన్నిగురించి తెలుసుకోవడం ఎంతో ముఖ్యం. అది తెలుసుకుంటేనే కదా దాని నివారణకోసం ప్రయత్నించడం. సూక్ష్మంగా చెప్పాలంటే, నీయదార్థ స్వభావ, స్వరూప నిరతిశయానందమైన ఆత్మస్వరూపాన్ని గురించిన అనుభవ జ్ఞానం నీ కెంతమాత్రమూ లేకపోవడమే అజ్ఞానం. నువ్వీ శరీరానివి ఎంత మాత్రమూ కావు. అనంతము, అఖండము, అద్వితీయము, సత్ చిదానందనిలయము అయిన భగవత్ స్వరూపమే నీ నిజస్వరూపం. ఆదివ్య స్వరూపానుభవం నీకిపుడులేదు. మహోన్నతమైన ఆ యదార్థ స్వరూపజ్ఞాన దృష్టి నువ్వు కోల్పోయినావు. నీకు అన్యదృష్టి కలిగింది. దానివల్ల నీ నిజస్వరూపం, మేఘాలవెనుక సూర్యుడిలా, మరుగై వుంది.

శిష్యుడు:- స్వామీ! అన్యదృష్టి అంటేయేమో నాకు బోధపడటంలేదు. దాన్నిగురించి వివరంగా తెలుప ప్రార్థన. అది నాకెందువల్ల కలిగింది.?

గురువు:- ఇంతకు ముందు చెప్పాను కదా! నిజంగా నువ్వు నిరాకార, నిష్క్రియ, నిరతిశయానందమయమైన ఆత్మ స్వరూపుడవైవుంటున్నా "నేనీ శరీరాన్ని" అనుకునే అనర్థదాయకమైన దేహాత్మభావం నీకు సంక్రమించింది. అన్యదృష్టి అంటె ఇదే. నీ సహజ, స్వభావ, స్వరూపమైన ఆత్మకంటె అన్యమైన దృష్టిని నీకు కల్పించింది కనుక దానికాపేరు సార్థక నామం అయింది. మెలకువ అనబడే జాగ్రదావస్థ ఈ అన్యదృష్టితోకూడిన అజ్ఞానావస్థ. అన్యదృష్టివల్లనే భేదబుద్ధి కలిగి అహంకార మమకారపరమైన సంసారభ్రమ సంభవించింది. దీనినే అవిద్య అని, అధ్యాస అని, మిథ్యాజ్ఞానమని, సాపేక్ష జ్ఞానమని అనేక విధాలుగా వేదాంత శాస్త్రాలు వర్ణిస్తున్నాయి.

శిష్యుడు:- స్వామీ! ఈ అన్యదృష్టి నాకెలా తొలగిపోతుంది? నా సహజ స్వభావ, స్వరూపమైన ఆత్మానుభవం తిరిగి నాకెలా సంప్రాప్తిస్తుంది? దానిని నేనీ జన్మలో సాధించి పొందగలనా?

గురువు:- తాము కోరుకునే ప్రయోజనాల్నీ, పదార్థాల్నీ,

పట్టుదలతో, శ్రద్ధగా ప్రయత్నించేసేవారు, వాటిని తప్పక పొందగలుగు తారు. ఎన్ని ఆటంకాలు, అవరోధాలు వచ్చినా, మధ్యలో ప్రయత్నాన్ని విడువకూడదు. ప్రయత్నం ఎంతతీవ్రతరంగా, చిత్తశుద్ధితో సక్రమంగా కొనసాగిస్తే, అంతత్వరితంగా ఫలప్రాప్తి కలుగుతుంది. ఇందులో సందేహించవలసిందేమీ లేదు. నిర్విరామ పురుష ప్రయత్నంవల్ల సాధించలేనిదేదీ లేదని శాస్త్రాల్లో స్పష్టం చెయ్యబడింది.

నీసత్య, స్వభావ, స్వరూపము ఆ పరమాత్మ స్వరూపమేనని ముందుగా నువ్వు నిర్ధారణచేసుకోవాలి. నీ సహజ స్వరూపాన్నే నువ్వు పొందడమనేది తప్పక సులభసాధ్యమే అవుతుందని దృఢమైన విశ్వాసాన్ని పెంపొందించుకోవాలి. ఈ నిర్ధారణ, దృఢవిశ్వాసం సచ్ఛాస్త్ర పఠనంవల్లా, సద్గురుని ప్రబోధాలవలనా నీకు తప్పక కలుగుతాయి. సత్వర అధ్యాత్మిక ప్రగతికీ, మోక్షప్రాప్తికి శాస్త్రాల్లో మూడు ఉపాయాలు చెప్పబడ్డాయి. అవేవంటే: శాస్త్రార్థగ్రహణం, ఆత్మజ్ఞానులతో సాంగత్యం, తత్వవిచారం (నిధిధ్యాస). ఆత్మజ్ఞానా మష్ఠానపరుల సాంగత్యం గంగాజలంలా, అజ్ఞాన మాలిన్యాలనన్నింటినీ కడిగి వేసి, మనో హృదయాల్ని శుద్ధపరుస్తుంది. పవిత్రత చేకూరుస్తుంది..

శిష్యుడు:- స్వామీ! ఆత్మజ్ఞాన వికాసాన్ని పొందడానికి అందరూ, అన్ని కులస్థులూ అర్హులేనా?

గురువు:- విద్యాబుద్ధులు కలిగిన వైరాగ్యసంపన్నులంతా ఉత్తమ ఆధ్యాత్మిక సాధనా విదానాన్ని చేపట్టి చిత్తశుద్ధితో ఆచరిస్తే, ఆత్మజ్ఞానవికాసాన్ని తప్పక పొందగలరు. అలాంటివారు ఏ కులస్థులైన , ఏమతస్థులైనా- తత్వజ్ఞానసాధనకు అర్హులే. అందరి హృదయాల్లో అంతటా నామరూపరహిత చైతన్య స్వరూపమైన పరబ్రహ్మం నిండివుంది. అది నిర్విషయ, నిరతిశయ నిత్యానందం. ఆధ్యాత్మిక సాధనలన్నిటికీ అంతిమలక్ష్యం.

శిష్యుడు:- స్వామీ! గురువేవా! ఆత్మజ్ఞానం అంటే ఏమో నాకు విచక్షణంగా తెలియపరచమని కోరుకుంటున్నాను, అది నాకెలా సిద్ధిస్తుంది? దానికి సాధనోపాయాలేవో నాకు బోధించమని ప్రార్థిస్తున్నాను.

గురువు:- జ్ఞానాన్ని రెండు విధాలుగా గ్రహించుకోవాలి. మొదటిది అజ్ఞానం వల్ల భాసించే మిథ్యాజ్ఞానం. దీనినే సాపేక్ష జ్ఞానమని, అవిద్య అని కూడా అంటారు. నామరూపాలతో తనచే తెలియబడుతున్న తన శరీరాన్నే తానుగా భావిస్తూ, ఈ సిరిసంపదలు తనవని, ఈ పనులు తాను చేస్తున్నానని అనుకొనే అహంకార మమకార, కర్తృత్వ భావాలు ఏవైతే సాధారణంగా అందరూ కలిగి వుంటున్నారో అదంతా మిథ్యాజ్ఞానం. ఇంక రెండవది "అహం బ్రహ్మాస్మి" (నేనే బ్రహ్మ స్వరూపుడనైవున్నాను) అనే తత్వమ స్యాది వేదాంతమహావాక్యాలు బోధించే ఆత్మజ్ఞానం. సమ్యగ్జ్ఞానమనీ, ప్రజ్ఞానమనీ కుడా దీనిని పేర్కొంటారు. ఈజ్ఞానస్వరూపమే బ్రహ్మస్వరూపం. "ప్రజ్ఞానం బ్రహ్మ" అనే వేదాంత మహావాక్యం దీనికి ప్రమాణం. శాస్త్రాధ్యయన సాధుజన సాంగత్యాల ద్వారా ఈ జ్ఞానాన్ని ఎలా పెంపొందించుకోవాలో తెలుస్తుంది. అజ్ఞానం వల్ల కలిగిన మిథ్యాజ్ఞానాన్ని పోగొట్టుకుంటే, ఆత్మానుభూతికి దోహదంచేసే ప్రజ్ఞానం సంప్రాప్తిస్తుంది. నిరంతర ఆత్మానాత్మవస్తు వివేచనవల్లా, తత్వ విచారణవలనా, మిథ్యాజ్ఞానం సమసిపోయి, ఆత్మజ్ఞానమైన సమ్యక్ జ్ఞానం ఉదయిస్తుంది.

శిష్యుడు:- స్వామీ! ఆత్మజ్ఞానం కలుగడానికి ప్రాపంచిక విషయాలన్నింటినీ త్యజించాలనీ, ఇంద్రియాలని, మనస్సును నిగ్రహించుకోవాలనీ కొందరు స్వాములు, గురువులు బోధిస్తూంటారు. దానిని గురించి తెలుసుకోవాలనివుంది.

గురువు:- అసలు ప్రపంచం అనేది యదార్థంగా ఎక్కడైనావున్నదా, ప్రాపంచిక విషయాల్ని త్యజించడానికని యోచించుకోవాలికదా!

అదంతా వట్టి మిథ్యాస్వరూపం తప్ప, నిజంగా లేనటువంటిదని, వేదాంతశాస్త్రాలు ధృవపరుస్తున్నాయి. "బ్రహ్మసత్యం - జగన్మిథ్య" అనే వేదాంతమహావాక్యం ఈ పరమార్థసత్యానికి ప్రమాణం.

కొందరు వేదాంతులు ఇంద్రియాల్ని నిగ్రహించుకోవాలని, కామ, క్రోధ, లోభ, మోహాది మనోవికారాలన్నిటినీ విడిచిపెట్టాలని బోధలు చేస్తూంటారు. అసలు, ఈ మనోవికారాలన్నీ ఎందువల్ల జని స్తున్నాయో, వాటికి మనిషి ఎందుకు వశుడౌతున్నాడో, దాన్ని గురించి పరిశీలించాలి కదా! మనోవికారాలన్నీ రోగలక్షణాలు (Symptoms) లాంటివని గ్రహించుకోవాలి. అసలు రోగమేమిటో నిర్ణయించి, సరియైన చికిత్స చేయిస్తే, రోగంతోపాటు రోగలక్షణాలుకూడా వాటం తట అవే వదలి పోతాయికదా! అలాకాకుండా, వట్టి లక్షణాలను పోగొట్టుకోమంటే అది ఎలా ఫలప్రదం అవుతుంది? అలాగే, మనోని గ్రహం అలవరుచుకుని, మనస్సుని ఆలోచనా రహితంగా చేసుకోమని అదేశిస్తూంటారు కొందరు స్వాములు. అది ఎంత అసంభవమో అందరికీ అనుభవైకవేద్యమే. భగవాన్ రమణమహర్షి ప్రబోధాలలో చెప్పినట్లు, నీటికి తడిలేకుండా చెయ్యమనడం ఎటువంటిదో, మనస్సును ఆలోచనలు లేకుండా వుంచుకోమనడం అటువంటిది. మనస్సంటేనే ఆలోచనలు, సంకల్పవికల్పాలు. అవిలేకపోతే ఇక మనస్సేది ఎక్కడుంటుంది? ఈ ఆలోచనలూ, సంకల్పవికల్పాలూ కలగడానికి కారణం ఏమిటో పరిశీలించాలి. ఆ కారణాన్ని తొలగించుకుంటే, సంకల్ప వికల్పాలూ, ఆలోచనలూ వాటంతట అవే సమసిపోతాయి కదా! వాటితో వ్యర్థమైన కుస్తీపట్టడం అవసరం వుండదు. యోగాభ్యాసంవల్ల కొంతకాలం మనస్సును నిరోధించి, తాత్కాలిక చిత్తశాంతిని పొందవచ్చు. దానివల్ల పరిపూర్ణ ప్రయోజనం ఎలా సంభవమౌతుంది? అటువంటి సాధకులకి స్వానుభవంవల్ల అది తెలిసిపోతూనే వుంటుంది. మళ్ళీ తిరిగి ఎప్పటిలాగే మనస్సు విక్షేపాలకి గురై ప్రపంచవిషయాలలో చిక్కుకుంటుంది. ఆలోచనలూ, సంకల్పాలూ తలలు ఎత్తుతూనేవుంటాయి. ఇలాంటి ప్రక్రియలన్నీ

రోగానికి ఉపశాంతి కలిగించే వాటిలా, తాత్కాలిక ప్రయోజనాన్ని, ఫలితాన్నీ కలుగజేస్తాయేకాని, వాటివల్ల శాశ్వత ప్రయోజనమైన అజ్ఞాన నివృత్తికలుగదు. అందుచేత, ఆత్మజ్ఞానమనే మందును సేకరించి, దానివల్ల అజ్ఞానరోగాన్ని పూర్తిగా నివారించుకోవాలని, ఆదిశంకరులు ప్రబోధిస్తారు. ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలూ కూడా దీనికే ప్రాధాన్యత ఇచ్చాయి. ఆత్మ జ్ఞానం వల్లే సంపూర్ణమైన స్వస్థతచేకూరుతుంది. తాను శరీరాన్ని అనుకునే దేహాత్మ బుద్ధీ, ప్రపంచం యదార్థమనుకునే జగద్భ్రిమా సమసి పోతాయి. అప్పుడు మనస్సు దానంతటఅదే మందగిలిపోతుంది. ఇక సంకల్పాలకూ, ఆలోచనలకూ తావెక్కడ? మనో మాలిన్యాలైన కామ క్రోధ , రాగ, ద్వేషాదుల ప్రసక్తి ఎలా వుండగలదు? ఆత్మజ్ఞానం వల్ల, శరీర ప్రపంచాదుల యొక్క యదార్థస్థితి అవగాహన అయిన సాధకుడుకి, ఇవన్నీ స్వప్నసమానంగా పరిణమిస్తాయి.

శిష్యుడు :- మహాత్మా! గురుదేవా! ఎంతో విచక్షణంగా అనుభవజ్ఞానంతో చెప్పే మీవాక్యాలు అమృతతుల్యంగా వున్నాయి. నేనెంతో ప్రభావితుణ్ణవుతున్నాను. ఆత్మజ్ఞానమే పరమావధి అని నాకు తెలుసును. దానికోసమే తమసన్నిధికి వచ్చాను. స్వామీ! మీకరుణా కటాక్షాలతో దాన్ని పొందటానికి నాకు దారి చూపండి!

గురువు:- ముందుగానే విన్నావుకదా ముఖ్యవిషయం. ఆత్మ అనేది పొందబడేది కాదు. తెలుసుకోబడేదీకాదు. ఆత్మసాక్షాత్కారం అనేపదం నిజంగా స్పష్టార్థరహితమైనదని మహాపురుషులు స్పష్టంచేశారు. ఎంచేతనంటే ఆత్మ స్వరూపానివి నువ్వే అయివున్నావు కనుక, నిన్ను నువ్వు పొందడమూ, తెలుసుకోవడమూ, సాక్షాత్కరించుకోవడము అనేది హాస్యాస్పదం. ఏవేవి తెలియబడుతున్నాయో, పొందబడుతున్నాయో, అవన్నీ అనాత్మ జాతాలే. అవేవీ ఆత్మకు సంబంధించినవి కావు. ఆత్మకు వాటితో ఎలాంటి ప్రమేయంలేదు. అయితే, ఈ అనాత్మ జాతాలన్నీ ఆత్మ వుండటంవల్లనే తెలియబడుతున్నాయి.

ఆత్మవల్లనే వాటికి ఉనికి. అవిలేకపోయినా ఆత్మవుంటుంది. కాని ఆత్మలేకపోతే అవి వుండే ప్రసక్తేలేదు. జాగ్రత్, స్వప్నావస్థ లంటారే. ఆ అవస్థలలో తెలియబడేదంతా అబద్ధమైన మిథ్యా స్వరూపమనీ, యదార్థంగా లేనటువంటిదనీ, ఏదైతే మనోబుద్ధీంద్రియాలకి తెలియ బడక, ఎల్లప్పుడూ, అంతటా వుంటున్నదో, అదే ఆత్మస్వరూపమని గ్రహించుకోవాలి. ఇలాంటి అనుభవగ్రాహ్యమే అసలైన తెలివి. ఈ తెలివినే ఆత్మజ్ఞానం అంటారు. నిత్యానిత్యవస్తు వివేకంవలనా, నిరంతర ఉత్తమ ఆధ్యాత్మిక సాధనవల్లా ఈ తెలివి కలుగుతుంది. ఇది ఆత్మానుభూతికి క్రింది మెట్టు. అంటే, ఈ రీతిగా ఆత్మజ్ఞానం కలిగిన వెంటనే, అజ్ఞానాంధాకారమంతా పటాపంచలై ఆత్మానుభూతి కలుగుతుందని అవగాహన చేసుకోవాలి.

శిష్యుడు:- మహాత్మా! గురువరా! ఆత్మ అన్నది తెలుయబడేదీ, పొందబడేదీ కాదని, అనుభవైక వేద్యమని నాకిప్పుడు అవగాహన అయింది. అయితే, నా సహజ, స్వభావ, స్వరూపమే అయివున్న ఆత్మానుభవాన్ని నేనిప్పుడు కోల్పోయి వుండటానికి కారణం నాకు తెలియటంలేదు. దేనివల్ల నాకిపుడు ఈ అన్యదృష్టి, అజ్ఞానం కలిగి, నాస్వరూపానుభవమే అయివున్న ఆత్మానుభవాన్ని నేను పోగొట్టుకున్నాను?

గురువు:- అవును. నీలో ఈ సందేహం జనిస్తుందని నాకు తెలుసు. నీప్రశ్న ఎంతో కీలకమైంది. మాయ అంటారే. దానివల్లే ఇవన్నీ నీకు సంక్రమించాయని తెలుసుకో.

శిష్యుడు:- స్వామీ! అలాగైతే మాయ అంటే ఏమో, ఆ మాయా స్వరూపం ఎట్టిదో తెలుసుకోవాలికదా! దయయుంచి దాన్ని గురించి వివరింప ప్రార్థన.

గురువు:- అజ్ఞానం, అవిద్య, అన్యదృష్టి వీటన్నిటికీ కారణం మాయ. ఉంటూన్నది లేనట్లు, లేనిది వుంటూన్నట్లు తోపింపజేసే అనిర్వచనీయ శక్తి స్వరూపమే మాయ అనేపేరుతో పిలవబడుతోంది.

అసత్యమైన మిథ్యా స్వరూపాలను యదార్థమైనవిగా తోపింపజేస్తూ, సత్యమైన దానిని అనుభవానికి రాకుండా అసత్యపు అడ్డంకులను సృష్టిస్తూ, ఆత్మను అజ్ఞానాంధకారంలో బంధించేది మాయయే. మెలకువ అనబడే జాగ్రదావస్థలోకి రాగానే నువ్వు నామరూపాల తోనున్న ఒక వ్యక్తిననే అహంకార సంకుచితభావంతో, దృశ్యగోచర ప్రపంచం అనే ఆవరణలో వుంటున్నట్లు భ్రమించిపోతున్నావు. అలాగే స్వప్నావస్థలో, ఇంకొక అహంకారుడవై, ఆ స్వప్న ప్రపంచంలో (స్వప్నావరణలో) నిజంగా వుంటున్నట్లు భ్రమపడుతున్నావు. ఈ జాగ్రత్, స్వప్నావస్థలు రెండూ మాయాప్రభావ జనితాలే. యదార్థంగా ఎప్పుడూ, ఎక్కడా లేనటువంటివి. కాని, ఆ అవస్థల్లో నీకు అవి వుంటున్నట్లూ, వాటిలోని అనుభవాలన్నీ నీకు కలుగుతున్నట్లూ భ్రమించి పోతున్నావు. ఈ రెండు అవస్థల మధ్యా కొంతసేపు ఎటువంటి అహంకార భావంగాని, ఎరుక, స్మృతి, మనోవికారాలుకాని లేక ప్రశాంతమైన గాఢనిద్ర కలుగుతోంది. దీనిని సుషుప్తావస్థ అంటారు. మాయవలన సంక్రమించే ఈ మూడు అవస్థలూ ప్రతినిత్యమూ ఎవరికి కలుగుతున్నాయన్నదే కీలకమైన, అతి ప్రధానమైన అధ్యాత్మిక తత్త్వం. ఈ మూడవస్థలూ నీకే కులుగుతున్నాయన్నది నిస్సందేహం. దీనిని ఒప్పుకోని వారెవరూవుండరు. కనుక, ఈ మూడు మాయా వస్థలకూ వెనక వుంటూ, వాటికి సాక్షిమాత్రుడవై వెలయుచున్న పరమేశ్వరుడవు నువ్వే అయివున్నావని, తత్వవిచారణద్వారా, నీ నిజస్వరూపాన్ని, నువ్వు నిర్ధారణ చేసుకోవాలి. ఇంద్రజాలమైన ఈ మాయా స్వరూపాన్ని గుర్తించి, దాని నుండి విముక్తి పొందాలి. జ్ఞానయుక్తమైన ఉత్తమ అధ్యాత్మిక సాధన ఈ విధంగా వుంటుంది. ముక్తీ, మోక్షమూ అంటే, తెలుసుకోవలసినదీ, పొందవలిసినదీ ఏదీకాదు. యదార్థంగా నువ్వే భగవత్ స్వరూపుడవై వుండగా నిన్ను నువ్వు తెలుసుకోవడమనేది హాస్యాస్పదం. చెయ్యవలసిందల్లా, జాగ్రత్, స్వప్న, సుషుప్తావస్థల మాయా స్వరూపాన్ని అవగాహనచేసుకొని, యదార్థంగా అవి లేనటువంటి మిథ్యా స్వరూపాలుగా వాటిని గుర్తించి,

వాటినుండి విముక్తి పొందడమే.

శిష్యుడు:- స్వామీ! ఈ మాయ అన్నది అనిర్వచనీయమ న్నారే! ఎందుచేత? అది ఎలా జనిస్తోంది? దానికి కారకుడు భగవంతుడా? దీనిని గురించి ఇంకా వివరంగా తెలియజెయ్యమని ప్రార్థిస్తున్నాను.

గురువు:- అవును. మాయను గురించి కూలంకషంగా అవగాహన చేసుకోడం నీబోటి సాధకులకి ఎంతో శ్రేయస్కరం. అకారశూన్యం, అపరిమితం, ఆద్యంతరహితం, అనంతం, ఆనంద మయం అయిన ఆత్మస్వరూపమే నీ నిజ స్వరూపం. అటువంటి నీ దివ్య స్వరూపానికి ఇపుడు నామరూపాలతో కూడిన ఒక వ్యక్తిత్వం, పరిమితత్వం కలిగింది. ఈ కించిజ్ఞత్వానికి కారణం అహంకారపరమైన దేహాత్మభ్రాంతి. ఈ భ్రాంతికి మూలకారణం మాయ. భగవంతుడిలాగే, ఈ మాయకూడా అద్యంతరహితం, అపరిమితం, అనంతం అయివుందని, గ్రహించుకోవాలి. కాని, ఇది సత్యస్వరూపుడైన భగవంతుడు మాత్రం కాదు. అసత్యజాతాలైన శరీర ప్రపంచాదులూ కాదు. ఆ అసత్య జాతానికంతటికీ ఇది సృష్టికర్త అని, వాటికి కారణభూతమని గ్రహించుకోవాలి. ఈ మాయ అన్నది, ఇటు సత్యవస్తువైన ఆత్మస్వరూపము, అటు అసత్య జాతమైన అనాత్మస్వరూపమూ కానిది. అందుకే, దీనిని అనిర్వచనీయమైన శక్తిస్వరూపమని వేదాంతులు భావించారు.

ఆత్మను అజ్ఞానంలో బంధించేదే మాయ. సత్యస్వరూపాన్ని మరుగుచేసి బుద్ధికి అసత్యపుభ్రాంతిని కలిగిస్తుంది. తామీ జడపదార్థానిర్మితమైన భౌతిక శరీరాలమనుకునే దేహాత్మభ్రమ మానవులకు కలగడం ఈ మాయాప్రభావంవల్లే కదా! లేకపోతే, తమ కళ్ళముందు ఎన్ని శరీరాలు కాల్చబడుతున్నాయి. నరక బడుతున్నాయి. శిథిలమై నశించిపోతున్నాయి. అయినా, రక్తమాంస పూరితమై, జడపదార్థ సమ్మేళనమైన ఈ శరీరం తాము ఎంత

మాత్రం కాదని ఎవరూ యోచించుకోరు. అహో! మాయ ఎంత దుర్ధమమైనది?

మాయనుగురించి ఎంతమాత్రమూ మనస్సూ, బుద్ధీ తెలుసుకోలేవు. భగవంతునిలాగే, మాయకూడా మనోబుద్ధీంద్రియాలకి అతీతమైవుంది. మరి దానిస్వరూపాన్ని ఎలాతెలుసుకోవడం?

మాయాస్వరూపం కూడా భగవత్ స్వరూపంతోపాటిదేనని గ్రహించుకోవాలి. ఎప్పుడైతే యదార్థమైన భగవత్తత్వం అవగాహన అయి అనుభూతమౌతుందో, అప్పుడే మాయాస్వరూపంకూడా గ్రాహ్యమౌతుంది. ఆత్మ స్వరూపంవలెనే మాయకూడా అనుభవైవక వేద్యము. అది మనోవాక్కులకు అందనిది. అందుచేత దాన్ని వర్ణించడం, వివరించడం అసంభవం. అది ఎవరివల్ల ఎలా జనించిందనేది చెప్పడం కూడా అసంభవం. అది కూడా భగవంతుని వలె, అవధులులేక, అనంతమై ఎల్లప్పుడూ వుండేదేనని గ్రహించుకోవడం ఉత్తమం. మనుష్యునితో అతని నీడ ఎలా వుంటున్నదో, అలాగే భగవంతుని నీడలా మాయవుంటున్నదని ఒక మహాపురుషుడు చమత్కారంగా వివరించాడు.

శిష్యుడు :- స్వామీ! ఈ మాయని కారణ శరీరమని వేదాంత శాస్త్రాల్లో చెప్పబడిందే! దాని అర్థమేమిటి?

గురువు:- స్థూల, సూక్ష్మశరీరాలతో కూడినదే మానవుని అజ్ఞానమయ జీవితం. పంచభూతాలైన ఆకాశము, వాయువు,అగ్ని (తేజస్సు), నీరు, భూమి యొక్క పంచీకరణం వల్ల ఈ స్థూల శరీరం ఉత్పన్నం అవుతోంది. ఇక సూక్ష్మశరీరం: శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలనే పంచ విషయాలను గ్రహించే ఐదు జ్ఞానేంద్రియాలు; వాక్కు, చేయి, కాలు, పాయువు (విసర్గేంద్రియం), ఉపస్థ అనే అయిదు కర్మేంద్రియాలు; ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము అనబడే ఐదు వాయువులు; మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అనబడే అంతఃకరణ చతుష్టయము

వీటినన్నింటినీ కలిపి సూక్ష్మశరీరం అంటారు. ఈ సూక్ష్మశరీరం ప్రవాహరూపంగా సంక్రమించే పూర్వవాసనాసహిత సుఖదుఃఖ కర్మలకు ఆలవాలమై, వాటి ఫలాల్ని అనుభవిస్తూంటుంది. దీన్ని లింగశరీరమని కూడా పేర్కొంటారు. ఈ స్థూల సూక్ష్మ శరీరాలు, పృథివ్యాది పంచభూతాలు, సుఖదుఃఖాది విషయ ప్రవృత్తులు - ఇక అదీ, ఇదీ అనే దేముంది. మనో బుద్ధీంద్రియాలకు గోచరించే సమస్తమూ మాయయొక్క సృష్టియే. అదంతాకూడా వట్టి అసత్యమైన మిథ్యాస్వరూపమేకాని యదార్థమైంది ఎంత మాత్రంకాదని గ్రహించుకోవాలి. అతిముఖ్యమైన ఈ ఆధ్యాత్మిక అంశం "వివేక చూడామణి"లో ఈ విధంగా విశదం చెయ్యబడింది:

మాయా మాయాకార్యం సర్వం మహదాది దేహ పర్యంతం|
అసది దమనాత్మకం త్వం విద్ధి మరు మరీచికా కల్పమ్||

అంటే, మహత్తు మొదలు దేహపర్యంతముగల ఈ సర్వ దృశ్య ప్రపంచమూ మాయాకల్పితమైన అసత్తని, మిథ్యాస్వరూపమైన అనాత్మకమని గ్రహించుకోవాలి. ఎండమావుల్లో నీరులేకపోయినా, నీరున్నట్లు ఎలా గోచరిస్తూంటుందో, అలాగే మాయా ప్రభావంవల్ల కల్పించబడ్డ శరీరాదులతోకూడిన ఈ సర్వజగత్తూ మిథ్య అయినప్పటికీ, భ్రాంతివల్ల, వున్నట్లేతోస్తూంటుంది.

మాయా ప్రభావం ఎటువంటిదో నీకు బోధపడుతున్నదా? అజ్ఞానమయమైన మానవుని జీవితానికంతటికీ కారణం మాయే. అందుకే దీనికి కారణ శరీరం అని నామకరణం చేశారు. ఈ మాయవల్ల ఇపుడు మెలకువ అనబడే అహంకారజనితమైన తెలివి కలుగుతోంది. దీనికి జాగ్రదావస్థ అని నామకరణం చేశారు వేదాంతులు. యదార్థంగా ఇది అజ్ఞానపు అంథకారమేకాని ఇది మెలకువా కాదు; తెలివీ కాదు. ఇది మాయానిశీథము. దీనివల్ల

తన సత్య, స్వభావ, స్వరూపమైన అద్వయానందస్థితి మనిషికి మరుగై పోతుంది. ఇది జ్ఞానపరమైన అసలైన తెలివికాదు. దీనిని ఇంద్రజాలమని, చిద్విలాసమని వేదాంతులు పేర్కొంటారు. ఎందువల్లంటే కృత్రిమమైన ఈ తెలివివల్ల, ఇంద్రియాలకు గోచరించే శరీర ప్రపంచాదులు నిత్యమైనవనీ, తనదేహమే తన నిజస్వరూపమని భావించుకొనే అసత్యమైన ప్రవృత్తి కలుగుతుంది. అన్ని కర్మకలాపాలకీ మూలమైన దేహమే తాననుకొనే దేహాభిమానం వల్ల, భేదబుద్ధికలిగి, తన నిజస్వరూపమైన ఆత్మకంటే అన్యదృష్టి ఏర్పడుతుంది. రజోగుణప్రవృత్తాలైన కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాది దుర్గుణ భ్రాంతులు ఉత్పన్నమౌతాయి. మనో వికారాలైన రాగద్వేషాదులు, సుఖ, దుఃఖాదులు, సర్వకర్మకలాపాలు - అన్నీమాయవల్లే సృష్టింపబడుతున్నాయి.

శిష్యుడు:- స్వామీ! అయితే ఈ మాయ సాధకునికి ప్రధానమైనదా? దీనిని గూర్చి తెలుసుకోవడం వల్ల ప్రయోజనమేమిటి?

గురువు:- సాధకుడికి ఈ మాయ ఎంతో అప్రధానమైనది! దాన్ని గురించి తెలుసుకోవడం వల్ల అది అసత్యమైన మిథ్యా స్వరూపాలను సృష్టించేదని, వట్టి అప్రధానమైందని స్పష్టంచేసుకోవడమే ప్రయోజనం. సాధకునికి అతి ప్రధానమైనది మాయాతీతమైన పరబ్రహ్మస్వరూపము. ఆ పరబ్రహ్మ స్వరూపం తానే అయివున్నాడు. కనుక, సాధకునికి అతి ప్రధానమైనది తానే.

శిష్యుడు:- స్వామీ! గురుదేవా! నేనెంత అదృష్టవంతుడను? అతి సుస్పష్టంగా, సందేహరహితంగా చెప్పే తమ అమృతవాక్కులు అజ్ఞానంవల్ల నాకు కలిగిన అపోహల్ని తుడిచివేస్తున్నాయి. అయ్యో! ఇంతకాలము నాకీ విశిష్టమైన తత్త్వం ఎంతమాత్రమూ తెలియని స్థితిలో వున్నాను? వివేక హీనుణ్ణై సక్రమ సాధనా పథం దొరకక, ఎంతోవిలువైన కాలాన్ని వ్యర్థంచేసుకున్నాను. స్వామీ! తత్త్వమంటే ఏమిటో సరిగ్గా నాకు అవగాహన అవడంలేదు. దాన్ని గురించి

వివరంగా చెప్పమని ప్రార్థిస్తున్నాను.

గురువు:- తత్వాన్ని రెండింటిగా అర్థం చేసుకోవాలి. మాయా తత్వమని, ఆత్మ తత్వమని. మాయా తత్వమంతా భౌతికమైనది. అహంకార, మమకార పరమై, జాగ్రత్, స్వప్న, సుషుప్తావస్థలతో కూడిన మనుగడకు చెందినటువంటిది. శరీర, ప్రాపంచక విషయాలకు, మనో బుద్ధీంద్రియాలకూ సంబంధించినది. దీని ప్రభావం వల్లనే, మానవులు దేహాత్మబుద్ధి కలిగి, అహంకార పరులై, రాగద్వేషాదులకులోబడి, సర్వకాల సర్వావస్థల యందూ విషయచింతనలు చేస్తూ, అనేక లౌకిక కర్మలను నిర్వర్తిస్తూంటారు. సంసారానికంతటికీ మూలం ఈ మాయా తత్వమే.

ఇక రెండవదైన ఆత్మతత్వమంటే పరతత్వం. ఇది అభౌతికమైనది. శరీర ప్రపంచాదులకు విలక్షణమైనది. నిర్విషయమై, మనోబుద్ధీంద్రియాలకు అతీతమైనది. ఈ పరతత్వసారస్వాన్ని జగద్గురువులైన శంకర భాగవత్పాదులు ఈ విధంగా చెబుతారు:-

మమాహమిత్యే తదపోహ్యాసర్వతో
విముక్తదేహం పదమంబరోపమమ్
సుదృష్టశాస్త్రాను మితిభ్యఈరితః
విముచ్యతేస్మిన్యది నిశ్చితోనరః

అంటే, స్థూల, సూక్ష్మ దేహాదులకంటే విలక్షణమై, ఆకాశంలా అంతటా వ్యాపకమై, ఉపాధి సంబంధమేమీ లేమిచే సంగరహితమై, అఖండము, ఏకాకారము, అద్వితీయము అయి ఎల్లప్పుడూ ఏది వుంటున్నదో అదే పరతత్వం. నేనీ దేహాన్ని, ఈ గేహాదికములు నావి - అనుకునే అజ్ఞాన దూషితములైన మోహవికారాల్ని పోగొట్టుకొని, సద్గురుని ప్రసాదము వలనను, వేదాంతశాస్త్ర విమర్శనము వల్లను, పరమోత్కృష్టమైన ఈ పరతత్వానుభవాన్ని తనసహజస్వరూపా నుభవంగా తెలుసుకోవడమే ఉత్తమ ఆధ్యాత్మిక సాధన. పరతత్వ

గ్రాహ్యమే మోక్షము.

శిష్యుడు:- స్వామీ! మాయ సాధకునికి ఎంతో అప్రధాన మైనదని చెప్పారు. కనుక ఈ మాయాతత్త్వం వల్ల ఎటువంటి ప్రయోజనమూ వుండదు. అతి ప్రధానమైనది, పరమోత్కృష్టమైనదీ అయిన ఆ పరతత్త్వాన్నే నాకు విశదీకరించండి. దాన్ని గురించి వింటూంటే నాజన్మ పునీతమౌతుంది.

గురువు:- వత్సా! నువ్వన్నది ఎంతో యదార్ధమైనది. ఈ జగత్తులో అన్నిటికంటే ఎంతో ఉత్కృష్టమైందీ, అత్యంత అద్భుతమైనదీ పరతత్త్వమే. ఈ మానవలోకంలో, అందరికంటె మహోన్నతుడూ, ఎంతో అరుదైనవాడూ, తత్త్వవేత్త.

శిష్యుడు:-స్వామీ! ఆ పరతత్త్వాన్ని నేనెలా అవగాహన చేసుకోగలను?

గురువు:-తత్త్వమంటే అర్థం ఆమాటలోనే ఇమిడివుంది. తత్+త్వమ్=అది+నీవే. అంటే, సత్యస్వరూపమైన ఏ భగవంతుని కోసం ఆధ్యాత్మిక సాధనలు ఆచరిస్తున్నావో, ఆ భాగవత్ స్వరూపుడవు నువ్వే అయివున్నావు. సామవేదంలోని "తత్త్వమసి" అనే వేదాంత మహావాక్యం, ఈ పరమసత్యాన్నే ప్రబోధిస్తోంది. యజుర్వేదంలోని "అహంబ్రహ్మాస్మి", అధర్వణవేదంలోని "అయమాత్మాబ్రహ్మ" అనే మహావాక్యాల అంతరార్థమూ అదే. సామాన్య సాధకులకి తత్త్వం సులువుగా తలకెక్కదు. కాని అది అంత కష్టతరమైందేమీకాదు. "నేను" అని ప్రతి మానవుడూ తనని వ్యవహరించుకుంటున్నాడు కదా! ఆ "నేను" అనుకునే అహం ప్రత్యయం, ఈ నామరూప దృశ్యాకార శరీరానికి ఎంతమాత్రం చెందనిదని, అది పరమార్థస్వరూప విశుద్ధచైతన్యాన్ని ప్రకటించే సంకేతమని గ్రహించుకోవాలి. ఆ శుద్ధచైతన్యమే ఆత్మస్వరూపము. ఆ చైతన్యమే జాగ్రదావస్థ అనబడే స్వాత్పాదిక సర్వదృశ్యపాదార్థిక జగత్తుగా గోచరిస్తోంది. అదే స్వప్నావస్థ అని పేర్కొనబడే మానసిక కల్పనా దృశ్యజాతమై భాసిస్తోంది.

అవన్నీ ఏకైక చైతన్యస్వరూపమైన ఆత్మయొక్క మిథ్యాస్వరూపాలేతప్ప నిజానికి ఆత్మకి అన్యంగా వేరెక్కడా లేనివేనని వేదాంత శాస్త్రాలు నిరూపిస్తున్నాయి. కనుక, ఈ ప్రపంచం నీకన్యంగా వుందని, నువ్వీ ప్రపంచంలో వుంటున్నావని అనుకోవడం యదార్థంకాదు. సప్నంలాగే, ఈ జాగ్రత్తుకూడా నిత్యం కొంతకాలం నీకు కలుగుతున్న అసత్యమైన అవస్థ. నిజానికి, స్వప్న, సుషుప్తావస్థలలో నీకీ శరీరం ఎక్కడుంది? ఏమైంది? కానీ జాగ్రదావస్థ అనబడే కొంత పరిమిత స్థితిలో మాత్రం నీకు ఈ అసత్యదేహాత్మభావం సంక్రమిస్తోంది. ఈ పరిమిత స్థితిలో మాత్రమే నీ స్థితిని దేహస్థితిగా భ్రమించిపోవడం జరుగుతోంది. ఈ దేహాత్మభావం వట్టి కల్పన మాత్రమే. "నేనుదేహాన్ని" అనుకొనే నామరూపాత్మక కల్పనాభావం కలగడం తోడనే - జనన మరణాదులతో కూడిన జగద్భ్రాంతి ఆవిర్భవిస్తోంది. ఇవన్నీ వట్టి కల్లలని, తాను తనని దేహునిగా అన్వయించుకొని, ఆత్మకు (తనకు) భిన్నునిగా భ్రమించి పోవడంవల్ల, తనకు సంక్రమించిన కృత్రిమ, మానసిక దృశ్య తరంగాలు తప్ప, అవి యదార్థాలు ఎంతమాత్రంకావని వేదాంత శాస్త్రాలు వ్యక్తం చేస్తున్నాయి. ఈ విధంగా శాస్త్రాధారమైన, ఈ మహత్తర పరబ్రహ్మతత్వాన్ని తత్వ విచారణ చేపట్టి ఆవగాహన చేసుకోవాలి.

శిష్యుడు:- స్వామీ! గురుదేవా! తత్వ విచారమనగానేమి? దానిని నేనెట్లు ఆచరించగలను? మోక్షపథం పొందడానికి తత్వవిచారణ ఆవశ్యరకమా?

గురువు:- ఓయీ! బుద్ధిమంతుడా! నీలో సతతమూ భాసిస్తూండే "నేను" అనేది బోధ (ప్రజ్ఞానం) కాని దేహంకాదు. ఇంద్రియాలకు గోచరించే సర్వ నామరూపాత్మక దృశ్యపదార్థాలనూ మిథ్యాస్వరూపాలుగా ఉపేక్షిస్తే ఇక శేషించి వుండేది ఆబోధ మాత్రమే. అది నిరాకారము. నిర్విషయ నిరానందము. భేద రహితము. అద్వితీయము. ఈ బోధస్వరూపమే నీ సహజ,

స్వభావ, స్వరూపమని అను సంధానం చేసుకోవాలి. దీనినే తత్వ విచారణ, లేక తత్వజ్ఞానానుష్టానం అంటారు. ముముక్షువులలో, విద్యాబుద్ధులుకలిగిన వివేకవంతులకు, ఈ తత్వజ్ఞానానుష్ఠానం సత్వర ఆత్మానుభవానికి దోహదం చేసే అత్యంత అనుకూలమైన మార్గం. తత్వమే తరుణోపాయం. తత్వజ్ఞానం ఒక్కటే ఆత్మసాక్షాత్కారానికి (స్వస్వరూపానుభవానికి) సక్రమమైన, సత్వరమైన మార్గం కాగలదు.

శిష్యుడు:- స్వామీ! గురుదేవా! తత్వవిచారసాధన కష్టత రమైనదా? దాన్ని ఆచరించడంలోగల సాధకబాధకాలు తెలియ జెయ్యమని కోరుకుంటున్నాను.

గురువు:- ఓయీ! బుద్ధిమంతుడా! ఈ ముఖ్యమైన విషయాన్ని శ్రద్ధగా విని గ్రహించుకో. జాగ్రదావస్థలోని ఇంద్రియ గోచర దృశ్యజాతమంతా, దాన్ని గురించి విచారింపని కారణంవల్ల, యదార్ధమైనదిగా తోస్తోంది. కనుక, వివేకవంతుడైన ఉత్తమ సాధకుడు శాస్త్రాధారమైన విధంగా: "నేనెవడను? జనన మరణాదులతో సంభ వించే ఈ ప్రపంచంయొక్క యదార్ధస్వరూపమేది? జాగ్రదావస్థలోని ఈ జగత్తంతా ఎక్కడినుంచి యేతెంచుతోంది? ప్రతినిత్యమూ సంభవిస్తూన్న ఈ జాగ్రత్, స్వప్న, సుషుప్త్యావస్థల యదార్ధమెట్టిది?" ఈ ప్రకారం ఈ మౌలిక విషయాల్ని గురించి చిత్తశుద్ధితో, అత్యంత శ్రద్ధతో, ప్రయత్నపూర్వకంగా, స్వయంగా విచారణచేసుకోవాలి. ఇలాంటి జ్ఞానయుక్తమైన తత్వవిచారణను "నిధిద్యాస" అంటారు. అన్ని ధ్యానసాధనల్లోకీ, ఇది సర్వోత్కృష్టమైనదని వేదాంత శాస్త్రాలు వ్యక్తంచేస్తున్నాయి. అన్ని సాధనలకంటె అత్యుత్తమమైనది కనుక, ఈ తత్వ విచార సాధనవల్ల సత్వరంగా పరమార్ధమైన బ్రహ్మస్వరూప వస్తుసిద్ధి కలుగుతుంది.

"అర్థశ్చ నిశ్చయోదృష్టో విచారేణ హితోక్తితః
నస్నానేన నదానేన ప్రాణాయామ శతేనవా"

అని "వివేకచూడామణి"లో చెప్పబడింది. అంటే తత్వ విచారంచేతా, సాధనయుక్తుల వల్లా, సుద్గరూపదేశ తత్వమశ్యాది మహావాక్యార్థ ప్రబోధితమైన బ్రహ్మస్వరూపంయొక్క నిశ్చయజ్ఞానం సిద్ధిస్తుందేకాని, గంగాస్నానాదులవల్ల గాని, దానధర్మాలు చెయ్యడం వలవ గాని, చాలాకాలం ప్రాణాయామసాధనలచేగాని తత్వనిశ్చయం (అపరోక్షజ్ఞానం) సిద్ధించదు. చీకటిలో వున్న వస్తువు దీపసహాయం వల్ల తప్ప, ఏఇతర కార్యకలాపాలవల్లా కనిపించనట్లు, ఆత్మజ్ఞానం, తత్వవిచారంవల్ల తప్ప ఏ ఇతర సాధనలవల్లా సిద్ధించదు. విద్యా బుద్ధులుగల వివేకవంతులైన సాధకులకు ఈ తత్వవిచారసాధన అతి సునాయాసమైనది. దీన్ని ఎటువంటి ప్రయాసాలేక అతిసులభంగా, సునాయాసంగా ఆచరింపవచ్చు. ఈ విషయాన్ని గురించి వేదాంత శాస్త్రాల్లో ఇలా చెప్పబడింది:-

సర్వాత్మనా పరంబ్రహ్మ శ్రోతురాత్మత యాస్థితమ్
నాయాసస్తత్ర విజ్ఞప్తౌ ఇతివేదాంత డిండిమః

అంటే, పరబ్రహ్మస్వరూపం స్వర్వాత్మగావుంది. "సర్వం బ్రహ్మ మయంజగత్" వేదాంత శ్రవణంచేసేవాడి ఆత్మకూడా బ్రహ్మమే అయివుంది. కనుక, తత్వ విచారసాధనలో ప్రయాసకాని, ఆయాసంకాని ఎంతమాత్రమూ వుండదు.

నువ్వే యదార్థంగా బ్రహ్మస్వరూపుడవై వుండగా, నిన్ను నువ్వు గుర్తించుకోటానికి చేసే సాధనలో ప్రయాస ఎల్లా వుంటుంది?

శిష్యుడు:- అయితే, ఇలా తత్వవిచారసాధన చెయ్యడానికి అందరూ, అంటే విద్యాబుద్ధులు గలవారందరూ, అర్హులౌతారా? స్వామీ! దీనిని ఆచరించలేని సాధకులు భక్తిమార్గాన్ని అనుసరించడం శ్రేయోదాయకం కదా!

గురువు:- తత్వం సులువుగా అవగాహన అవటానికి అర్హత అవసరం. దానికి ఎవరు అర్హులో వారికే అది లభ్యమవుతుంది. అటువంటివారికే తత్వవిచార సామర్థ్యం కలుగుతుంది. తత్వవిచార ప్రవృత్తి, సామర్థ్యం ఎవరికి, ఎపుడు జనిస్తాయో వేదాంత శాస్త్రాల్లో వివరంగా విశదం చెయ్యబడింది. వర్షాకాలంలో తీవ్రతరంగా వర్షాలు వృద్ధిపొందుతూ కురుస్తూంటే, సస్యశ్యామల సంపన్నమైన శరత్కాలం వస్తున్నది. ఆవిధంగానే, సమస్త ప్రాపంచక, విషయ భోగాలయందూ వివేకయుక్తమైన విరక్తి దృఢపడ్డతోడనే, అటువంటి సాధకుడికి తత్వవిచారణ జనిస్తుంది. విషయభోగాల విరక్తి, తత్వవిచారణ, ఆత్మానుభూతి - ఈ మూడు పరస్పర మిత్రుల్లా ఒకదానికొకటి సహాయకారులౌతాయని వేదాంత శాస్త్రాల్లో చెప్పబడింది. కనుక, తత్వ విచారసాధనా తత్పరుడైన సాధకుడు, యమనియమాది సాధన సంపత్తి, విషయవైరాగ్యం ఆత్మజ్ఞానమునందత్యంత అభిలాష కలిగి వుండాలి. లేకపోతే అది నిరంతరాయంగా కొనసాగుతూ ఫలప్రదం అవదు. ఇలా అర్హత కలిగివుండి తత్వవిచారసాధన సరళంగా, సక్రమంగా ఎడతెగక ఆచరిస్తూన్న సాధకమహాశయుడికి జాగ్రదావస్థలో గోచరించే దృశ్యప్రపంచ జాతమంతా మనోకల్పితమైన మిథ్యామాత్రమే కాని యదార్థంకాదని, అదికూడా స్వప్నంలాంటిదేనని అవగాహన కలుగుతుంది.

ఇక భక్తిమార్గం శ్రేయోదాయకంకదా అని అన్నావుకదా! అసలైన భక్తి ఏదో భక్తులందరూ అవగాహన చేసుకోవడం ముఖ్యం. భగవంతుడనేవాడు సాధకుడికి అన్యంగా, బాహ్యంగా ఎక్కడాలేడని, సాధకుడే భగవత్స్వరూపుడై వున్నాడని తెలుసుకున్నావుకదా! కనుక, భగవద్భక్తి అనేది స్వస్వరూపానుసంధానమని గ్రహించుకోవాలి. మనవేదాంతశాస్త్రాలు భక్తిని గురించి ఈ విధంగా విశదం చేస్తున్నాయి.:-

మోక్షసాధన సామగ్ర్యాం భక్తిరేవగరీయసీ
స్వస్వరూపాను సంధానం భక్తిరిత్యభిధీయతే ॥
(వివేక చూడామణి 30)

అంటే, ముక్తికోసం చేసే సాధనాలలో భక్తి ఎంతో శ్రేష్ఠమైంది. భక్తి అంటే స్వస్వరూపాను సంధానం.

ఈ శ్లోకంలోని అధ్యాత్మిక సత్యానికి అనుగుణంగా స్వస్వరూపాన్ని (ఆత్మవి ) గురించి ఆకాంక్షతో కూడిన అనుసంధానమే అసలైన భక్తి. యదార్థమైన ఆధ్యాత్మిక అనుష్ఠానం, తన నిజస్వరూపంలో నిమగ్నుడై (ఆత్మాను సంధానపరుడై) ఉండడం.

శిష్యుడు:- స్వామీ! గురుదేవా! జగత్తంతా మిథ్యాస్వ రూపమనే నిశ్చయత్వం నాకెలాసంభవమౌతుంది? అసత్యమైన ఈ జగత్తుయొక్క భ్రాంతినాకేవిధంగా తొలగిపోతుంది.?

గురువు:- నిత్యానిత్యవస్తు వివేకంతోకూడిన తత్వవిచారణవల్ల, ప్రపంచమంతా మిథ్యాస్వరూపమనే నిశ్చయజ్ఞానం తప్పక సంప్రాప్తి స్తుంది. కావలసిందల్లా - చిత్తశుద్ధితో, అత్యంత శ్రద్ధతో - ఈ సాధన చేపట్టి నిరంతరం, నిరంతరాయంగా ఆచరించడమే. అలా ఆచరిస్తే అచిర కాలంలోనే, సంకల్ప, వికల్పాలు సమసిపోతాయి. మనస్సు క్షీణించి పోతుంది. చింతలన్నీ క్రమక్రమంగా తొలగిపోవడంతో, చిత్తంలో పరమశాంతి నెలకొంటుంది. అహంకార భావం అణగారిపోతుంది. ఏకము, నిరాకారము, నిత్యము, నిర్మలము, నిర్వికల్పము అయిన ఆత్మ నీ నిజస్వరూపంగా ప్రకటితమై భాసిస్తుంది. వాస్తవంగా, ఉన్నది ద్రష్ట(ఆత్మ) ఒక్కటి మాత్రమేకాని, దృశ్యమనేది ఏదీ యదార్థంగా లేనే లేదనే ఆత్మజ్ఞానం ఉదయిస్తుంది. పంచజ్ఞానేంద్రియాలు, పంచ కర్మేంద్రియాలు, పంచభూతాలు, పంచకోశాలనుబడే స్థూల, సూక్ష్మ శరీరాదులు - వీటన్నిటినీ విపులంగా వేదాంత శాస్త్రాలు వివరించి,

చివరికి ఇవన్నీ వట్టి మిథ్యాస్వరూపాలు మాత్రమేకాని యదార్థాలు ఎంతమాత్రం కావని విశదపరుస్తూ, వాటిని విస్మరించమంటాయి. ఉన్నది ఆత్మ చైతన్యమొక్కటే తప్ప వేరేదీ, ఎప్పుడూ, ఎక్కడా లేదనేది సర్వవేదాంత సిద్ధాంతసారం. కాబట్టి ఈ మిథ్యాస్వరూప దృశ్యజాతాలనన్నింటినీ తత్త్వవిచారణతో ధృవపరచుకొని విస్మరిస్తే, ఇక శేషించివుండేది ఏకైక ఆత్మ స్వరూపుడవైన నువ్వేకదా! ఏకైకస్వరూపుడవు, బోధస్వరూపుడవు, సర్వసాక్షి అయిన నువ్వు చైతన్యమాత్రుడవై ఎల్లప్పుడూ వుంటూన్నవాడివే. నీకు మినహా మరేదీ, ఎప్పుడూ, ఎక్కడా లేదు. నువ్వే ఈ సర్వానికీ అధిష్టానము. సర్వ వ్యాపకమైన సద్రూపచైతన్యము. ఏకైక పరిపూర్ణస్వరూపము. పరబ్రహ్మస్వరూపము.

శిష్యుడు:- మహాత్మా! గురుదేవా! తత్త్వవిచారణ అంటే ఏమో నాకిప్పుడు సుబోధకమైంది. తమ కరుణాకటాక్షాలతో, తోడ్పాటుతో నేనీ ఉత్తమ సాధన ఆచరిస్తాను. దానిని ఏ విధంగా అనుష్ఠానం చేసుకోగలనో వివరంగా తెలుప ప్రార్థన.

గురువు:- సర్వోత్తమమైన ఈ ఆధ్యాత్మికసాధన నీకు పరిమితమైన, స్వకీయమైన ప్రక్రియ. దీనిలో సాధనాంశాలు నాలుగు: నువ్వూ, నీకు సంబంధిచిన, ప్రతినిత్యమూ నీకు సంక్రమిస్తూన్న జాగ్రత్, స్వప్న, సుషుప్త్యవస్థలు. ఈ మూడు అవస్థలవల్లే నీ సహజ, స్వభావ బ్రహ్మానంద స్వరూపాన్ని నువ్వుకోల్పోయావు. కనుక, వాటినుండి నువ్వు విముక్తుడవు కావాలి. అయితే ఆ అవస్థలను, నువ్వు వదుల్చుకోవాలనుకోడం తత్త్వదూరమైన భావన. యదార్థంగా ఎక్కడా లేనివాటిని వొదుల్చుకోవటమనేది ఉత్పన్నం కాదు కదా! వాటి యదార్థస్వరూపాన్ని అవగాహన చేసుకుంటే సరిపోతుంది. అవి నిజంగా లేనివని, మిథ్యాస్వరూపాలు తప్ప యదార్థాలుకావని నీకు విదితమైతేచాలు. నీకు నిత్యమూ సంభవిస్తున్న, అసత్యమైన ఈ మూడు అవస్థల్ని గురించీ, తరచి, తరచి తత్త్వ విచారణ

చేసుకో. మెళకువ అనబడే జాగ్రదావస్థలోకిరాగానే "నేను" అనుకొనే స్ఫురణ నీలో ఉద్భవిస్తోంది. అది ఎక్కడ నుంచి జనిస్తోందని విచారిస్తే, చివరకు అది తను ఉదయించిన చోటనే లీనమై నీయొక్క యదార్థ చైతన్యస్వరూపమైన ఆత్మలో లయించిపోతుంది. ఈ రీతిగా అనుష్ఠానంచేసుకునే తత్త్వవిచారసాధన ద్వారా, అజ్ఞానంవల్ల కోల్పోయిన నీ చైతన్యానంద వైభవస్వరూపాన్ని స్వయంగా తిరిగి ప్రకటితం చేసుకోగలవు. నిరంతరం నీ అంతఃకరణలో తత్త్వవిచారణ కలిగి, జగత్తంతా మిథ్యాస్వరూపము, అనిత్యము అని అవగాహన చేసుకుంటే కాలక్రమం గా ఆత్మే స్వయంగా ప్రసన్నమై నీస్వరూపంగా సాక్షాత్కారమౌతుంది.

శిష్యుడు:- స్వామీ! బంధము, మోక్షము అని అంటారు. వాటి యదార్థమేమి?

గురువు:- రక్తమాంసాది జడపదార్థాలతో పూరింపబడి, చర్మ బద్ధమై నీచే తెలియబడే శరీరంతో నువ్విప్పుడు తాదాత్మ్యం చెంది, ఆ శరీరమే నీవని దేహాభిమానం కలిగి వున్నావు. ఇదే నీకు కలిగిన బంధం. నిజంగా బంధం అనేది ఎక్కడుంది? అది కేవలం కల్పితం. మోక్షమంటే ఈ కల్పిత మిథ్యాబంధంనుండి విమోచనం. ఎప్పుడూ వుండేది మోక్షమే. నిర్విశేష నిత్యాత్మ స్వరూపస్థితి. నువ్వెప్పుడూ ముక్తుడవే. కనుక మోక్షాన్ని సాధించాలనుకోవడం అర్థరహితం. బంధం ఎప్పుడూ లేనిదే. అదివట్టి భ్రమ తప్ప వేరేదీకాదు. కనుక, నువ్వీ బంధమోక్ష కల్పనలను త్యజించి, భయరహితుడవై వుండు.

శిష్యుడు:- నాకీ విషయం అవగాహనకాలేదు. స్వామీ! కొంచం విపులంగా తెలియజెయ్యప్రార్థన.

గురువు:- బంధం, మోక్షం అనేవిలేవు; అవి మనోకల్పితాలే అని చెప్పానుకదా! అసలు లేనేలేనటువంటి దేహాన్ని కల్పించుకుని, ఆదేహాన్ని నేననుకుంటూ, దేహాత్మ భ్రాంతి తెచ్చిపెట్టుకోవడమే బంధమనబడుతోంది. ఈ జాగ్రత్ స్వప్నావస్థలు రెండూకూడా

వట్టి మిథ్యాస్వరూపాలు, అసత్యాలు తప్ప యదార్థాలు కానప్పుడు, వాటిలోని శరీరాలు, దృశ్యాలు నిజాలెలా అవుతాయి? అవన్నీ వట్టికల్లలే. మనోకల్పితాలు. వట్టి కల్పనలైన ఈ మిథ్యాస్వరూపాల యొక్క యదార్థాన్ని, అంటే అవన్నీ వట్టి మిథ్యాస్వరూపాలుమాత్రమేకాని యదార్థంగా లేనటువంటివని, తత్వ విచారణ ద్వారా గ్రహించుకుని, నిర్ధారణ చేసుకోవడమే మోక్షమని తెలుసుకో. అవును. తత్వగ్రాహ్యమేమోక్షం. బంధ మోక్షాలనేవి ఎక్కడాలేవు. అవన్నీ కల్పనలే.

శిష్యుడు:- స్వామీ! గురుదేవా! కర్మయోగమని, నిష్కామకర్మ చెయ్యాలని చెబుతూంటారు. కర్మని గురించి అనేకవిధాలుగా విన్నాను. మీ వద్దనుంచి జ్ఞానయుక్తంగా దీన్ని గురించి తెలుసుకోవాలనివుంది. అనుగ్రహించండి.

గురువు:- సర్వ సందేహాలకీ మూల కారణం, కర్త ఎవరో, అసలీకర్మలనేవి ఎవరు చేస్తున్నారో ఎరుగక పోవడమే. మనం చేస్తున్నామనుకునే కర్మలు, యదార్థంగా మనంచేస్తున్నామా? ఈ కర్మలకన్నింటికీ కర్త ఎవరని విచారించి, ఎవరు ఈ పనులు చేస్తున్నారో గ్రహిస్తే, అన్ని సందేహాలూ అంతమౌతాయి. చూడు. ఈ శరీరం వట్టి జడపదార్థనిర్మాణం. అది ఏపనీ తనంతటతాను చెయ్యలేదు. ఇక, నామరూపాలేలేని చైతన్యస్వరూపమైన ఆత్మ కర్మలు చెయ్యడమేమిటి? కర్మలతోకూడి గోచరించే ఈ సర్వజగత్తూ అజ్ఞానంవల్ల మనలోనే భాసిస్తూన్న వట్టి ఇంద్రజాలం తప్ప యదార్థంకాదని తెలుసుకోవాలి. వివేచనవల్ల మనం కర్తలం ఎంతమాత్రం కాదని తెలుసుకోవడమే ఉత్తమమైన ఆధ్యాత్మిక జ్ఞానం. అదే అపరోక్షజ్ఞానం. ముక్తికి పరమపదసోపానం.

శిష్యుడు:- స్వామీ! అయితే, కర్మలజోలికిపోకూడదా? కర్మలని విసర్జించాలా?

గురువు:- యదార్థ విషయాన్ని గ్రహించుకుని, నీకు ఎలా

చెయ్యాలనుంటే ఆ ప్రకారం చేసుకోవచ్చు. ఉత్తమ ఆధ్యాత్మిక సాధకుడెప్పుడూ జ్ఞాన నిష్ఠలోనే ఆసక్తికలిగి వుంటాడు. జ్ఞానము, కర్మము - ఈరెండూ వెలుగు, చీకటిలాగ పరస్పర విరుద్ధ స్వభావాలు కలవి. ఒకచోట రెండూ కలిసి వుండలేవు. కర్మలన్నీ - కామ్యకర్మలు గాని, నిష్కామకర్మలుగాని - దేహాత్మబుద్ధితో, కర్తృత్వ భోక్తృత్వా భిమానాలతో, కూడుకొనివుంటాయి. కర్తృత్వబుద్ధి, దేహాత్మభావము (ఈ శరీరమేనేను అనుకొనే అపోహ) లేకుండా కర్మలు ఆచరించడం అసంభవం. కర్మలు ఆచరిస్తోన్నకొద్దీ దేహాత్మభ్రాంతీ, కర్తృత్వబుద్ధీ పెరిగి పోతూనే వుంటాయి. ఇక ఆత్మజ్ఞానా నికి తావెక్కడ? అన్నికర్మలకీ అజ్ఞానమే కారణమని ఎప్పుడూ గుర్తుంచుకోవాలి. అందుకే "వివేక చూడామణి"లో ఇలాచెప్పబడింది:-

> చిత్తశ్యసుద్ధయేకర్మ నతు వస్తూపలభ్యతే,
> వస్తుసిద్ధిర్విచారేణ నకించిత్ కర్మకోటిభిః

అంటే, కర్మలన్నీ (సత్కర్మలు), చిత్తశుద్ధికోసం మాత్రమే నిర్దేశింపబడినవి తప్ప, బ్రహ్మవస్తు సిద్ధికోసంకాదు. పరమార్థమైన బ్రహ్మానుభవం తత్వవిచారం వల్లే కలుగుతుంది గాని, కోట్లకొద్దీ కర్మలు ఎంతెంతకాలం చేసినా అది సిద్ధించదు.

వ్రతాలు, దానాలు, యజ్ఞ యాగాదులు, తీర్థయాత్రలు, సంఘ సేవ - ఇలాంటివి అనేక నిష్కామకర్మలు తాము చేస్తున్నామని, అహంకారపూరితులై తమను ఆధ్యాత్మికులుగా, ఆత్మజ్ఞాలుగా అనేక మంది భావించుకుంటూ ఆహ్లాదపడుతూంటారు. తమ అహంకార భావాన్నే ఆత్మానుభూతిగా అనుకుంటూ అపోహపడుతూంటారు. ఇంద్రజాలంలాంటి ఈ మిథ్యాస్వరూప మాయాప్రపంచంలో, ఏ కర్మలు చేయబడినా, అవన్నీ అర్థరహితమైనవే అవుతాయికదా! జ్ఞానదృష్టిలో వాటికి ఎలాటి వునికీ, విలువా వుండదు. స్వప్నంలోని కార్యకలాపాలకి

గురువు:- ఇంతకుముదు నీకు విశదపరచినవిధంగా విరంతరం నిరంతరాయంగా తత్త్వవిచారణ (నిధిధ్యాస) ఆచరిస్తే, నీ అజ్ఞానం అంతా క్రమంగా క్షయించిపోతుంది. దృశ్యగోచరాలైన శరీర ప్రపంచాదులన్నీ వట్టిమిథ్యాస్వరూపాలని, అనాత్మలని, అప్రధానమైనవని తెలివి కలుగుతుంది. అపుడు దృష్టి వాటివైపుకు మళ్ళదు. మనస్సుకి గొప్పనిలకడ కలిగి, చిత్తంలో పరమశాంతి నెలకొంటుంది. దానిని, మహదానందంతో పరమ మౌనావస్థలో అనుభవిస్తూంటాడు. ఇట్టి స్థితినే సమాధిఅంటారు. మిథ్యాస్వరూపమైన దృశ్యజగత్తుతో ఆత్మకు ఎప్పుడూ సంబంధంలేదు. అటువంటి దృశ్యరహితమైన ఆత్మస్వరూపమే నీ నిజస్వరూపం. ఈ పరమసత్యాన్ని అవగాహన చేసుకుని, నిశ్చలంగా ప్రశాంత చిత్తంతో అలా ఉండి పోవడమే సమాధి.

శిష్యుడు:- దృశ్య రహితమైన స్థితి అంటే మనోబుద్ధీంద్రియాలకి అతీతమైన స్థితి అనుకుంటున్నాను. అది నాకెలా సంప్రాప్తమౌతుంది?

గురువు:- అవును. ఆస్థితి సక్రమమైన సాధన చేస్తే, నీకు తప్పక సంప్రాప్తిస్తుంది. చూడు. కేవలం శ్రవణ, మనన సత్కాలక్షేపాలవల్ల అనుభవైకవేద్యమైన, అత్యంత మహత్తరమైన ఆత్మజ్ఞానం ఎలా అబ్బుతుంది? తత్త్వ విచార సాధన అంతా ఏకాంతంగా, ప్రశాంత వాతావరణంలో జ్ఞానయుక్తంగా, ఎవరికివారు బహుకాలం అన్యమొల్లని భక్తిశ్రద్ధలతో స్వయంగా ఆచరించుకోవలసిన ప్రక్రియ.

నీలో సతతము "నేను నేను" అని స్ఫురిస్తూండే "అహం" నీ శరీరం ఎంతమాత్రం కాదని గ్రహించుకుని ఆ అహమిక యొక్కయదార్థాన్ని తెలుసుకుని స్వాధీనపరచుకోవాలి. ప్రతి నిత్యమూ నీకు తారసిల్లుతున్న జాగ్రత్, స్వప్న సుషుప్తావస్థల్ని పరిశీలిస్తూ, వాటికి సాక్షీమాత్రుడవైన నీయదార్థ సత్యానంద చైతన్య స్వరూపాన్ని ఆ మూడవస్థలకీ విలక్షణమైనదిగా అవగాహనచేసుకుని నిర్ధారణ

చేసుకోవాలి. ఆహమిక యొక్క యదార్థగ్రాహ్యామే ఆత్మానుభూతి. అదే సమాధిగా పరిణమిస్తుంది. ఇలా నీలో "నేను" అని భాసించే అహంకరణను అన్వేషిస్తే నువ్వు నీ సహజ, స్వభావ స్వరూప, చైతన్యాత్మానందంలో లీనమౌతావు. నిరవధికమైన ఆ ఆనందానుభవమే సమాధి. అంటే, ఆత్మతత్వవిచార విశ్రాంతియే సమాధిగా పరిణమిస్తుంది. ఈ రీతిగా శాస్త్రాలలో చెప్పబడిన సమాధిని స్వానుభవంవల్ల ఉత్తమ అధ్యాత్మిక సాధకులు పొందగలుగుతారు.

శిష్యుడు:- స్వామీ! సమాధి ఎన్నివిధాలుగా వుంటున్నది. వాటిని ఆచరించే విధానమేది?

గురువు:- సవికల్ప సమాధి, నిర్వికల్ప సమాధి అని సమాధి రెండు విధాలు. సవికల్ప సమాధిలో ధ్యాతకూ, ధ్యేయ విషయమైన ఆత్మ సత్తకూ భేదం తెలియబడుతూనే వుంటుంది. నిర్వికల్ప సమాధిలో ధ్యేయ ధ్యాతల భేదం రద్దయి, ధ్యేయమైన బ్రహ్మస్వరూపంలో ధ్యాత లగ్నమైపోతాడు. అంటే, జ్ఞాతృ జ్ఞాన వికల్పాలు లేక దేహస్మృతిని దాటిపోయి, అద్వయానంద బ్రహ్మస్వరూపస్థితిని పొంది వుంటాడు. నీటిలో ముంచిన ఉప్పుగడ్డ నీటిలో కలిసిపోయి నీరే అయి, వేరుగా కనబడదు కదా! ఆ ప్రకారమే, నిర్వికల్ప సమాధిలో బ్రహ్మ స్వరూపాన్ని పొందిన బుద్ధి, బ్రహ్మంలోనే లయమై, బ్రహ్మకంటే వేరుగా భాసించదు. అంటే ధ్యాత ఉనికి పూర్తిగా తుడిచివేయబడి ఏకైక అద్వయానంద పరబ్రహ్మమై వుండడమే నిర్వికల్ప సమాధి.

ఈ సవికల్ప, నిర్వికల్ప సమాధులలో, సవికల్పసమాధి - దృశ్యాను విద్ధమని, శబ్దానువిద్ధమని - రెండు విధాలుగా వుంది. ఈ రెండు సమాధి క్రమాలు ఏవిధంగా వుంటాయో ఇపుడు వివరంగా చెబుతాను. శ్రద్ధగా విను.

దృశ్యానువిద్ధ సవికల్ప సమాధి :- దేహేంద్రియాదుల యందుగల "నేను, నాది" అనే అభిమానాన్ని నశింపజేసుకోవడమే దృశ్యాను విద్ధ సవికల్ప సమాధియొక్క సాధనాంశం. నీచే తెలియ

బడుతున్న సమస్త చిత్తవృత్తులూ, అహంకార మమకారభావాలతో ముడిపడి వున్నాయి. ఈ చిత్త వృత్తులన్నీ అజ్ఞానం వల్ల ఆత్మకంటే భిన్నమైనవిగా గోచరిస్తున్నాయికనుక, అవి దృశ్యాలనబడుతున్నాయి. అవన్నీ ఎవరిచే తెలియబడుతున్నాయో, ఏది వాటికి సాక్షిస్వరూపమై భాసిస్తోందో దానిని, నిర్విషయ, నిర్వికార ఆత్మ స్వరూపంగా అవగాహన చేసుకోవాలి. అదే నీయదార్థ, సహజ స్వరూపం. నీకు దృశ్యాలుగా గోచరించే వాటన్నిటికీ నువ్వు భిన్నుడవేకదా! ఇలా నీకు దృశ్యగోచరమయే నామ రూపాది ప్రపంచమంతా ఆత్మయందు కల్పితమైన మిథ్యా స్వరూపం తప్ప యదార్థం కాదని వేదాంతశాస్త్రాలు వ్యక్త పరుస్తున్నాయి. అందువల్ల, ఈ దృశ్యవృత్తులన్నీ ఆత్మకంటే అన్యంగా ఎక్కడా లేనివని, ఆకల్పిత మిథ్యా స్వరూపాలతో ఆత్మకు (నీకు) ఎటువంటి సంబంధము వుండజాలదని ధృవపరచుకుంటూ, వాటి నన్నింటినీ నీయందే (ఆత్మయందే) లయింపజేసుకోవాలి. ఈ సాధనక్రమం ఎలా వుంటుందంటే: నేనిప్పుడు చెప్పబోయే విధంగా తత్వ విచారణలో నువ్వు ధ్యాన నిమగ్నుడవు కావాలి

నీకు గోచరిస్తూన్న, జడ పదార్థ నిర్మిత అవయవ సముదాయమైన ఈ శరీరానివి నువ్వుకాదు. అది నీచే జాగ్రదావస్థలో నామరూపాలతో తెలియబడే రక్తమాంసాది జడపదార్థ నిర్మిత వస్తు రూపమైన ప్రతిమ. అది మార్పులు చెందిపోతూ, ఎప్పుడైనా నశించిపోయేది. అది నీ స్వరూపం ఎలా అవుతుంది? ఎప్పుడూ అవదు. యదార్థంగా ఆత్మస్వరూపుడవై వుంటూన్న నువ్వు నిన్ను దేహంగా అన్వయించుకుంటూ ఆత్మకి భిన్నుణ్ణని భ్రమించిపోతున్నావు. అందుచేత, నువ్వు నీ నిజస్వరూపమైన ఆత్మవేననే గాఢ విశ్వాసాన్ని పెంపొందించుకోవాలి. అలాగే నీ మనస్సుకూడా నీ స్వరూపంకాదని, అది సర్వదా మార్పులు చెందుతూ, పెరుగుతూ, తరుగుతూ, సుషుప్తిలో (గాఢనిద్రలో) అదృశ్యమౌతూ అనర్థదాయకములైన సర్వ వికారాలనూ నీకు సంక్రమింపజేస్తూ నీకన్యమై ఉండేదని గ్రహించుకోవాలి. ఈ ప్రకారమే చిత్తము, బుద్ధి, అహంకారము -

ఇవేవీ నువ్వుకాదని, వీటన్నిటికీ నువ్వు అన్యుడవని తత్వచారణలో నిర్ధారణ చేసుకోవాలి. వీటికి కారణమైన అజ్ఞానము, అవిద్య అనబడే మాయ నీ స్వరూపం ఎలా అవుతుంది?

స్వప్నంలో తోచే సర్వ దృశ్యాలూ, విషయాలూ కల్పితాలై, ఏ విధంగా అసత్యాలో, ఆ ప్రకారమే, ఈ దృశ్యప్రపంచం శరీరం, పంచప్రాణాలు, పంచేంద్రియాలు, మనస్సు అహంకారాది సర్వవికారాలు నీకు భిన్నమైన మిథ్యాస్వరూపాలు తప్ప యదార్ధాలు కానివని, నువ్వు వాటన్నింటికీ విలక్షణుడవై ఏకైక , నిరాకార, నిర్వికార, అనంతమయుడవైన ఆత్మ స్వరూపుడవై వున్నావని భావన చేసుకుంటూ, నీకంటే అన్యమై గోచరించే సర్వ దృశ్య జాతాన్నీ (నీ శరీరంతో సహా) యదార్ధంగా లేనివేనని నిశ్చయం చేసుకోవాలి. ఈ విధంగా నిరంతర నిరంతరాయంగా తత్వవిచారం (నిధిధ్యాస) చేస్తూంటే, బహు జన్మార్జిత, అజ్ఞానజనితమై, దేహేంద్రియాదుల యందు భాసించే "నేను" "నాది" అనుకొనే అహంకార మమకార భావాలు త్వరత్వరగా తొలగి పోతాయి. స్థూల, సూక్ష్మ, మనోమ యచైతన్యాల భ్రాంతివదలి పోతుంది. నిత్యానందస్వరూపుడవై నీ స్వస్థితిలో నువ్వు తిరిగి ప్రకాశిస్తావు. సూక్ష్మంగా చెప్పాలంటే, ఇంద్రియ గోచర దృశ్యజాతమంతా మనోకల్పితమైన మిథ్యా భాసమని ధృవపరచుకొంటూ, ప్రశాంతచిత్తుడవై వుండి పోవడమే దృశ్యానువిద్ధ సవికల్ప సమాధి. నువ్వు సర్వసంసార పర్జితుడవైన ఆత్మస్వరూపుడవే అయివున్నావని, నీకు గోచరమయే మిథ్యా ప్రపంచాదులన్నీ నీకంటె (ఆత్మకంటే) వేరుగా ఎక్కడా యదార్ధంగా లేనివని నిశ్చయంకలవాడవై, అలాటి మహోన్నత స్థితిలో స్థిరత్వాన్ని పొందుతే ఇక సాధించ వలసిందేముంటుంది? నిరంతర నిర్విరామ సాధన (నిధిధ్యాస) వల్ల, ఇటువంటి సమాధిస్థితి తప్పక సంభవిస్తుంది. ఈ విధమైన సాధన దృశ్యాను విద్ధ సవికల్ప సమాధి క్రమమైవుంది.

## శబ్దానువిద్ధ సవికల్ప సమాధి :-

ఇక సవికల్ప సమాధులలో, రెండవదియైన శబ్దానువిద్ధ సవికల్ప సమాధి క్రమాన్ని గురించి చెబుతాను. తెలుసుకో. ఇంద్రియగోచర శరీర ప్రపంచాదులన్నీ యదార్థంగా లేనటువంటి మిథ్యాస్వరూపాలని గ్రహించావు కదా! ఉన్నది సత్ చిదానంద చైతన్య స్వరూపమైన బ్రహ్మమొక్కటే. ఆ బ్రహ్మము నువ్వే అయి వున్నావు. "అహం బ్రహ్మాస్మి", "బ్రహ్మైవాహం" "తత్త్వమసి" - ఇత్యాది వేదాంత మహావాక్యాలు ఈ పరమ సత్యసిద్ధాంతానికి ప్రమాణాలు. ఈ నిజతత్త్వ బోధకములైన శబ్దార్థపదాలను ఉచ్చరిస్తూ, వాటి వలన సుబోధకమయే ఆత్మస్వరూపాన్ని (నీ నిజ స్వరూపాన్ని) నిధిధ్యాన చేసుకోవడమే శబ్దానువిద్ధ సవికల్ప సమాధి. అంటే, దేహాది దృశ్యాకారాలనుంచి మనస్సును మళ్ళించి, ప్రశాంతమైన చిత్తంతో, ఆత్మను గురించిన శబ్దార్థ పదాలను నీ స్వరూప చిహ్నాలుగా భావనచేసుకుంటూ, మానసికంగా వాటిని ఉచ్చరిస్తూ, నీ నిజస్వరూపమైన ఆత్మను ధ్యానం చేసుకోవాలి. ఇలా మానసికంగా నువ్వు ఉచ్చరించుకునే పదాలు ఈ విధంగా వుంటాయి:

"నేను దేహాకారముగాని, అవయములుగాని లేని నిరాకార చైతన్య స్వరూపుడను. ఎటువంటి మార్పులేని ఏకైక స్వరూపుడను. నామము, రూపము, బాల్యము, యౌవ్వనము, వృద్ధాప్యము, మరణము ఇటువంటి వేవీ లేనివాడను. వాటినన్నింటినీ వీక్షించే సాక్షి మాత్రుడను. ఎటువంటి గుణవికారాలూలేని శుద్ధుండను నేనెప్పుడూ అకర్తనే; నామ, రూప, గుణాదులేవీ లేనటువంటి నేను కర్మలు చెయ్యడమేమిటి? నేను ఈ సర్వ దేహాలయందూ ఉంటూ భాసించే ఆత్మ స్వరూపుడను. చిదానందుడను. జాగ్రత్తులో తెలియబడే శరీర ప్రపంచాదులూ, స్వప్నంలో గోచరమయ్యే దృశ్యజాతాలూ - అవన్నీ నాలోంచి వెలువడు నా మానసిక మిథ్యాస్వరూపాలు మాత్రమే. అవేవీ స్వయంగా ఉనికి లేనివి.

ఉన్నది నేనొక్కడనే. ఆ స్వకల్పిత మిథ్యాసృష్టి పరంపర కంతటికీ సాక్షిని. దృశ్యాతీతమైన కేవల దృక్స్వరూపుణ్ణి. నేను సత్వ, రజ స్తమోగుణాలకి అతీతుణ్ణి అంతటా, సర్వత్రా, సర్వావస్థలయందూ ఉండేవాడను నేనే. నేను ఆదీ, అంతమూ లేనివాడను సృష్టికంతటికీ మొదటివాడను. నాకంటే మొదటి వాడెవడూలేడు.నేను ముదిమి, నాశము లేనివాడను. వ్యక్తుడను. అవ్యక్తుడను.అగోచరుడను.అనంత శక్తిమంతుడను. అఖండానందమయుడను.పరిపూర్ణుడను.పరమశాంతి స్వరూపుడను. తత్వజ్ఞానస్వరూపుడను. జాగ్రత్, స్వప్న, సుషు ప్త్యావస్థలకు సాక్షిమాత్రుడనై తురీయానంద స్వరూప పరబ్రహ్మమే నేనై వున్నాను. నా స్వస్వరూప బ్రహ్మానుభవములోనే నెనెప్పుడూ వుంటున్నాను."

ఈ విధములైన పదముల శబ్దాలను మానసికంగా ఉచ్చరిస్తూ, వాటి అర్థాలను అనుసరించి ఆంతర్యంలో భావన చేసుకుంటూ, ధ్యాన నిమగ్నుడై వుండటమే శబ్దానువిద్ధ సవికల్ప సమాధి అవుతుంది. ఇలా ధ్యాన నిమగ్నుడైనవాడు, స్వయంప్రకాశమై, తన యదార్థ స్వరూపమే అయివున్న పరమాత్మతో ఐక్యతాను భవాన్ని పొందగలుగుతాడు

శిష్యుడు:- స్వామీ! గురుదేవా! ఈ ప్రకారం సవికల్ప సమాధులు ఆచరిస్తే నిర్వికల్పమాధి సిద్ధిస్తుందా? నిర్వికల్ప సమాధిస్థితిని పొందిన మహనీయుడేనా జీవన్ముక్తుడు?

గురువు:- అవును. నే చెప్పిన విధంగా రెండు విధముల సవికల్ప సమాధులను నిరంతరము నిరంతరాయంగా అభ్యసిస్తే, ధ్వ మైన సమాధి సంస్కారం కలుగుతుంది. సత్వరంగా, సునాయాసం నిర్వికల్ప సమాధి సంప్రాప్తిస్తుంది. నిరంతర నిధిధ్యాసవల్ల దేహస్మ అతిక్రమించి, శాశ్వతమైన, అచంచల అద్వయానంద స్థితి వుండటమే నిర్వికల్ప సమాధి. స్వతః సిద్ధంగా పరబ్రహ్మస్వరూపుడ అయివున్న నీయందు మాయచే నీకు భిన్నమైనదిగా ఆరోపించబడి సర్వద్వైత ప్రకృతి సంబంధమూ క్షయిస్తేకాని నిర్వికల్ప సమాధి

సిద్ధించదు. నిర్వికల్ప సమాధిని బ్రహ్మజ్ఞాన సమాధి అని కూడా అంటారు. ఈ సమాధి సిద్ధించిన మహానీయుడు ఆత్మారాముడై కైవల్య స్థితిని పొంది జీవన్ముక్తుడౌతున్నాడు.

శిష్యుడు:- స్వామీ! నిధిధ్యాస అంటే ఎటువంటి సాధన. దానికీ ధ్యానానికీగల తేడా ఏమిటో తెలుపమని ప్రార్థిస్తున్నాను.

గురువు:- సాధకులచే చెయ్యబడే ధ్యానాలు వారివారి శక్తిసామర్థ్యాలను, సంస్కారాలను, అర్హతలనుబట్టి వివిధ రీతులుగా వుంటూంటాయి. బొత్తిగా శాస్త్రజ్ఞానంలేని ఆరంభదశలోనున్న సామాన్య సాధకులు ఏదైనా దైవ రూపంమీదో, స్థూల వస్తువుపైనో ధ్యానాలు చేస్తూంటారు. అంటే శివుడు, రాముడు, కృష్ణుడు లాంటిదైవరూపాలలో వారికికేది ప్రియతమమో దానినికాని, లేదా గురురూపాన్నో, దేవతా రూపాన్నో, వారికిష్టమైన దాన్నికాని ఎన్నుకుని దానిమీద చిత్తాన్ని ఏకాగ్రతచేస్తూ ధ్యానించడం. ఇవన్నీ జ్ఞాన యుక్తమైన ధ్యానాలు అవవు. ఇలాంటిధ్యానాలు తత్వజ్ఞాన రహితంగావుంటూ, వాటివల్ల చేకూరే ప్రయోజనాన్ని అవి కలుగజేస్తాయి. కాని సర్వోత్కృష్టమైన ఆధ్యాత్మిక ప్రయోజనంకోసం చెయ్యబడే ధ్యానం వేరుగా వుంటుంది. అది వివేకజ్ఞానంతోకూడిన ఆత్మవిషయకమైన విచారణ. దీనినే నిధిధ్యాస అంటారు. తత్వవిచారమన్నా, ఆత్మనిష్ట అన్నా ఈ నిధిధ్యాసయే. ఇది అన్ని ధ్యానాలకంటే అత్యుత్తమమైంది. జ్ఞానయుక్తమైనది. అన్ని ధ్యానాలూ చివరికి ఈ జ్ఞానపరమైన ఆత్మోపాసన దగ్గరికి చేరుకునేవే.

యోగవాశిష్టంలో దేముడెవరో, అసలైన దేవార్చనయేదో ఎంతో విపులంగా తెలియజెయ్యబడింది:

అకృత్రిమ మనాద్యంతం దేవనం దేవ ఉచ్యతే
ఆకారాది పరిఛిన్నేమితే వస్తుని తత్కృతః
అకృత్రిమ మనాద్యంతం దేవనం చిఛినం విదుః

అంటే, అకృత్రిమం, అనాద్యంతం అయివున్న నిరాకార, నిరతిశయ చైతన్యానంద స్వరూపమే దేవుడు. అంతేకాని, పరిచ్ఛిన్నమై, పరిమిత వస్తువులైన ఆకారాదులలో దైవత్వం ఎలావుండగలదు? కనుక, దేముడు అకృత్రిమ ఆద్యంతరహిత చిదానందుడైన శివస్వరూపుడని తత్త్వవిదుల నిర్వచనం. మహత్తరమైన ఇలాటి యదార్థ భగవత్తత్వాన్ని గ్రహించలేని వారికోసం విష్ణ్వాది కృత్రిమ ఆకారములయొక్క అర్చనా విధానాలు నిర్దేశింపబడ్డాయి. జ్ఞాన యుక్తమైన ధ్యానానుష్ఠానంచేత నామ, రూపరహితుడైన ఆత్మదేవుణ్ణి పూజించే సాధన యేదో అదే అసలైన దేవార్చన అని, నామరూపాలతో కూడిన కృత్రిమ సాకారార్చన అపరిశుద్ధ బుద్ధిగలవారికి, బాలురవలె అల్పచిత్తులైన మందబుద్ధిగల వారికి విధింపబడిందని, అది పరిపూర్ణ ప్రయోజనకరమైన దేవార్చన అవదని యోగవాశిష్టంలో ఎంతో స్పష్టంగా విదితం చెయ్యబడింది.

కాబట్టి, విద్యాబుద్ధులు గల వివేకవంతులైన సాధకులు నిధిధ్యాస అనబడే తత్త్వవిచారసాధనాన్ని చేపట్టి అనుష్ఠానం చేసుకుంటే సత్వర ఆధ్యాత్మిక ప్రయోజనాన్ని పొందగలుగుతారు. నిదిధ్యాసే నిజమైన ఆత్మోపాసన. ఆత్మస్వరూపమే దైవము. ఈ విధమైన ఆత్మోపాసన సవికల్ప సమాధిక్రమంలో నీకు ఇంతకుముందు చెప్పబడింది. అదే మళ్ళీ చెబుతున్నాను విను. నువ్వెవరో, నీయదార్థస్వరూపమేదో, ఈ ప్రపంచం ఇలా ఎవరిచే సృష్టింపబడుతోందో, ఈ దృశ్యజగత్తంతా దేనివల్ల ఆవిర్భవిస్తోందో మొదలైన మౌలిక విషయాల్ని గురించి విచారణ చేసుకోవాలి. అవయవాలతోకూడి ఒక ఆకారంతో నీచే తెలియబడే ఈ శరీరానివి నువ్వుకావని గుర్తుంచుకోవాలి. జాగ్రవావస్థలో కొంతకాలమే అది నీకు తెలియబడుతోంది. అది ఎంత మాత్రమూ నీ నిజ స్వరూపంకాదు. జడపదార్థనిర్మితమై, పంచభూతసమ్మేళనమైన ఈ స్థూల శరీరం కంటే నువ్వు భిన్నుడవే. ఇక సూక్ష్మశరీరమనబడేదానికి సంబంధితమైన పంచేంద్రియాలు, మనస్సు, బుద్ధి, చిత్తం - ఇవేవీకూడా నువ్వు కావని నిర్ధారణ చేసుకోవాలి. అవన్నీ నీచే తెలియబడుతూ నీకు సంక్రమించిన అనర్థదాయకమైన

అవిద్యా ప్రవృత్తికి సంబంధించినవి. సర్వదా మార్పులు చెందుతూ, పెరుగుతూ తరుగుతూ, సుషుప్తిలో అదృశ్యమౌతూ, జడస్వభావం కలవి కనుక అవి నీ నిజ స్వరూపానికి ఎంతమాత్రమూ సంబంధించినవి కావని గ్రహించుకోవాలి. ఇలా చిత్తశుద్ధితో, అత్యంత శ్రద్ధతో ఆచరించే అనుష్ఠానంవల్ల "నేను, నేను" అని సతతము నిన్ను ప్రకటించుకుంటూన్న నువ్వు ఈ స్థూల, సూక్ష్మశరీరాలకు భిన్నుడవే అయివున్నావని తెలివి ఉదయిస్తుంది. ఈధ్యానం చేపడితే ఇక వేరే సాధనలేవీ చెయ్యనక్కర్లేదు. దీనియొక్క ప్రాశస్త్యాన్ని యోగవాశిష్ఠంలో ఇలా చెప్పబడింది:

ధ్యానోపహార ఏవాత్మా ధ్యానం హ్యస్య సమీహితమ్
ధ్యానమర్ఘ్యంచ పాద్యం సంవేదనాత్మకమ్
ధ్యానసంవేదనం పుష్పం సర్వంధ్యానపరం విదుః

ఆత్మస్వరూపమైన దేముడికి ధ్యానమే కానుక. ఆత్మదేముడికి అత్యంత ప్రియమైంది ధ్యానమే. చిత్తశుద్ధితో చేసే చైతన్యాత్మకమైన ధ్యానమే ఆయనకు అర్ఘ్యపాద్యాలు. సత్ చిదానందమయమైన ధ్యాననిష్ఠయే ఆయనకు పుష్పము. ఈ ప్రకారంగా ధ్యానమే సర్వానుష్ఠానం అయివుంది.

ఇక నేను చెప్పేదేముంటుంది. సకల లౌకిక కార్యకలాపాలకు స్వస్తిచెప్పి నిరంతరం, నిరంతరాయంగా నే చెప్పిన విధంగా నిదిధ్యాసలో నిమగ్నుడవై జీవితాన్ని సార్థకం చేసుకో.

శిష్యుడు:- స్వామీ! ధన్యుణ్ణి. అనుగ్రహంతో మీరు ప్రబోధించిన సాధనని ఆ ప్రకారం తప్పక ఆచరిస్తాను. దీనివల్ల ఆత్మానుభూతి, సర్వాత్మభావము తప్పక సిద్ధించగలవని నాకు నమ్మకమైంది.

గురువు:- ఈ పరతత్త్వ విచార సాధనలో సందేహానికి

తావులేదు. తత్వగ్రాహ్యమే మోక్షమని తెలుసుకున్నావుకదా. తత్వం యొక్కసారాంశం "దేహోనాహం, బ్రహ్మైవాహం" నువ్వీ దేహానివి కావని, బ్రహ్మస్వరూపమే నీ నిజస్వరూపమని, "నేను, నేను" అని సతతము నిన్ను ప్రకటించుకుంటూండే నువ్వు ఈ శరీరానికి భిన్నుడవై వున్నావని అనుభవగ్రాహ్యం నీకు కలగాలి. శరీరానికి భిన్నము, విలక్షణము అయిన నీ నిజస్వరూపం నామ రూపాలులేని చైతన్యస్వరూపం. ఇలా యదార్థంగా చైతన్యస్వరూపుడవైన నువ్వు శాశ్వతంగా ఎల్లపుడూ అవధుల్లేకుండా అంతటా వుంటున్నావు. ప్రతి నిత్యం నీకు జాగ్రత్తులో గోచరిస్తూన్న శరీర ప్రపంచాదులు, స్వప్నంలో తటస్థించే దృశ్యజాతాలు అన్నీ వట్టి మిథ్యాస్వరూపాలు మాత్రమే. అవేవీ యదార్థంగా ఎక్కడా లేనటువంటివి. ఎల్లప్పుడూ ఉంటూన్నది నువ్వొక్కడివే. నిత్యము, సత్యము, శాశ్వతము అయినవాడవు. నామ, రూపరహిత చిదానందుడవు. నీలోనుంచే వెలువడుతూ, నీకన్యంగా ఎక్కడాలేనివై, నీస్వరూపమే అయివున్న ఈ సమస్త మిథ్యాదృశ్య పరంపర కంతటికీ నువ్వు సాక్షిమాత్రుడవు. అంటే, ద్రష్ట, దృక్కు దృశ్యము అనే త్రిపుటి యదార్థంగా లేదనే పరమార్థ సత్యాన్ని అవగాహనచేసుకోవాలి. అదంతా వట్టి అసత్యమైన భ్రాంతి. చూడు: స్వప్నంలో నీకు గోచరించే వన్నీ నువ్వేకదా! అవన్నీ ఎక్కడేన బాహ్యంగా, నీకు అన్యంగా వున్నాయా? ఈ జాగృతిలోనివన్నీకూడా అంతే. ఒక వేళ నీకు తెలియకుండా పూర్వవాసనల వల్ల వాటిని గురించిన చింతనలు వచ్చిపడినా, బాధపడటం అనవసరం. వెంటనే అవన్నీ నువ్వేకాని నీకన్యమైనవి కావని గుర్తింపుకు తెచ్చుకో. ఈ జాగ్రదావస్థలోని సర్వమూ నువ్వే అయి వున్నావు. స్వప్నంలోః సర్వమూ నువ్వేకదా! అలాగే ఇక్కడాను. "సర్వం బ్రహ్మమయం జగత్""అహంబ్రహ్మాస్మి" అనే వేదాంత మహావాక్యాలు ప్రబోధించే ఈ పరమసత్యాన్ని బోధపరచుకుని అవగాహన చేసుకో. అన్ని శాస్త్రాలలోని కీలకం చివరికి ఇదే. భగవద్గీతలోకూడా శ్రీకృష్ణుడు అర్జునుడితో ఈ పరమ సత్యాన్నే అనేక విధాలుగా చెబుతాడు. యజ్ఞం

చేసే హోమసాధనాలు, అన్నం, నెయ్యి మొదలైన హోమద్రవ్యాలు, యజ్ఞంచేసేవాడు, అగ్ని, హననక్రియ, యజ్ఞఫలము, అన్నీకూడా బ్రహ్మస్వరూపమేకాని బ్రహ్మేతరమైనవేవీ లేవని. దీని అంతరార్థం గ్రహించుకో.

ఇలాటి తత్వవిచారం చేసుకుంటూ, అందులో నిమగ్నమవటం అన్ని ధ్యానాలకంటె సర్వోత్కృష్టమైన ధ్యానం. ఈ ధ్యానమే నిధిధ్యాస. అన్ని ధ్యానాలూ అంత్యదశలో జ్ఞానయుక్తమైన ఈ నిధిధ్యాస దగ్గరికే చేరుకుంటాయి. ఆత్మని గురించి ఇలా ఆచరించే నిధిధ్యాసయే ఉత్తమ ఆధ్యాత్మికసాధన అవుతుంది. దృశ్యధ్యానంకాని, రూపధ్యానంకాని యదార్థమైన సత్యాన్ని గురించి చేసే విచారణ ఎలా అవుతుంది? సత్యం సర్వదృశ్య, ప్రపంచ రహితమైందికదా! ఆ సత్యస్వరూపమైన ఆత్మవు నువ్వేకదా!

శిష్యుడు:- నేనెంత అదృష్టవంతుణ్ణి. పరతత్వమైన భగవత్తత్వం యేదో నాకిప్పుడు స్పష్టంగా, సంశయరహితంగా, సాధ్యాసాధ్యంగా గ్రాహ్యమైంది. తమ సాంగత్యంవల్ల నాజన్మ సఫలమైంది. స్వామీ! స్వస్వరూపాను సంధానము, బ్రహ్మనిష్ఠ, తత్వవిచారము ఇవన్నీ ఒకటేనా! ఈ సాధన చేసే వ్యక్తి సన్మార్గుడైవుండాలని చెబుతారు. సాధకుడు ఏయే నియమాలు కలిగి వుండాలి?

గురువు:- స్వస్వరూపాను సంధానము, బ్రహ్మనిష్ఠా ఒకటే. నీ నిజస్వరూపం బ్రహ్మస్వరూపమేకదా! ఆ స్వరూపచింతనమే తత్వ విచారము. అన్ని సాధనలలోకి ఇదే ఉత్తమమైన, సర్వోత్కృష్టమైన, శీఘ్రఫలప్రదాయకమైన సాధన అని తెలుసుకున్నావు కదా!

సన్మార్గము, దుర్మార్గము, ధర్మము, అధర్మము ఇలాటి ద్వంద్వ భావాలు ఆత్మజ్ఞుడికి అప్రధానమైనవి. భగవంతుడు ద్వంద్వరహితుడు. గుణాతీతుడు. మిథ్యాస్వరూపాలైన ఈ ద్వంద్వాలన్నింటినీ కల్పించే మనోబుద్ధులకు అందనివాడు. తాను సన్మార్గుడనని, సన్యాసినని, ఆధ్యాత్మికుడనని అనుకోడం అహంకార పరమైన అజ్ఞానమే అవుతుంది.

ఎంత సన్మార్గుడైనా, ఆధ్యాత్మికుడైనా, తాను ప్రత్యేకమైన ఉనికిగల ఒక వ్యక్తిననే దృక్పథం తనలో ఉన్నంతవరకు, తనకు ఇంకా ఆత్మతత్వం ఎంతమాత్రమూ అబ్బలేదని తెలుసుకోవాలి. తననుతాను గుర్తించుకోలేని ఆత్మ వంచకునిగా నిందించుకోవాలి. తన వ్యక్తిత్వ అనాత్మ భావమే తన్నీ వంచన చేస్తోంది. దానిని పొగొట్టుకోడానికే ఈ సాధన చేపట్టడం.

శిష్యుడు:- స్వామీ! ఈ సాధనకు పూనుకున్న సాధకుడు ఏయే నియమాలను పాటించాలి. సాధన సత్వరంగా ఫలప్రదం కావాలంటే ఏమేమి అలవరుచుకోవాలి?

గురువు:-పతంజలి యోగసూత్రాలలో ఆధ్యాత్మిక సాధకులు ముఖ్యంగా పాటించవలసిన నియమాలు ఈ విధంగా చెప్పబడ్డాయి:

"యోగశ్చ ప్రథమం ద్వారం
వాఙ్నిరోధో పరిగ్రహః
నిరాశాచ నిరీహాచ
నిత్యమేకాంత శీలతా."

అంటే, మౌనాన్ని పాటిస్తూండడం; ఇతరులనుండి సొమ్ముకాని మరే వస్తువుకాని తీసుకొనకుండటం, ఎలాటి లౌకిక వాంఛలు లేక ఉన్నదాంతోను, సంప్రాప్తించిన దానితోను తృప్తి, సంతోషము కలిగి వుండటం, కామ్యకర్మలయందు ఎలాటి ఆసక్తి, ప్రయత్నం లేకుండటం ఏకాంత వాసంలోను, ఆత్మధ్యానంలోనూ, ఎప్పుడూ వుండే శీలాన్ని అలవరుచుకోవడం.

సాధకులు అలవరచుకోవలసినవి: 1. ప్రశాంతమైన, ఏ· తమైన ప్రదేశం. 2. మితమైన సాత్వికాహారం. 3. తప్పని నిత్య, నైమిత్తిక కర్మలు మినహా, ఏయితర ప్రాపంచిక విషయాల పట్టించుకోక వాటి మీద విముఖత, అలక్ష్యం కలిగి వుండట 4. స్వస్వరూపాను సంధానపరమైన తత్వవిచారసాధనలో ఎల్లప్పుడు

నిమగ్నుడైవుండటం.

శిష్యుడు:- స్వామీ! ఇకశెలవు. తమ చరణ కమలములకు నమస్కారము లర్పిస్తున్నాను. అజ్ఞాన, అహంకారాదులతో, దేహాత్మ భావోన్మత్తుడనై, సంసార మహాస్వప్నంలో చిక్కుకున్న నన్నుద్ధరించి రక్షించారు. తమకృపా, కటాక్షాలవల్ల నాకిప్పుడు సక్రమమైన సంశయరహితమైన ఆత్మ పథం లభించింది. ధన్యుడనయాను.

గురుప్రబోధసుధాలహరి
సమాప్తం

ఓం తత్ సత్

# ప్రార్థన

ఆత్మా జ్ఞేయః పరోహ్యాత్మా యస్మాదన్యన్న విద్యతే
సర్వజ్ఞః సర్వదృక్శుద్ధ స్తస్మైజ్ఞేయాత్మనే నమః||

పరమ పురుషార్థమైన ఆత్మ జ్ఞానమే తెలిసికొనదగినది. స్వస్వరూపమే అయివున్న ఆత్మ మనో బుద్ధీంద్రియాదులచే గ్రహింపబడునది కాదు. వీటన్నిటికీ కారణమై, సమస్త దృశ్యజాతములకూ అతీతమై, సాక్షిస్వరూపమై ఉంటున్నది. జ్ఞాత ఆత్మకంటె అన్యమైనవాడు కాదు. సర్వజ్ఞము, దోష దుఃఖరహితము ఏకైక పరిపూర్ణ జ్ఞానానందస్వరూపము అయిన ఆత్మ ఉపాధి వశమున జీవాత్మ అనబడుతున్నది. అటువంటి నిత్య, సత్యానంద స్వరూపమునకు నమస్కారము.

ఓం గురుభ్యోనమః

# సద్గురు ప్రార్థన

విద్యయా తారితాః స్మోయైః
జన్మ మృత్యు మహోదధిమ్
సర్వజ్ఞేభ్యో నమస్తేభ్యో
గురుభ్యో జ్ఞాన౽సంకులమ్

తా॥ స్వకల్పిత అజ్ఞానాహంకార జన్యమై, జన్మ, జరా, మృత్యాది దుఃఖ పరం పరాసంయుక్తమై తోచు సంసార సముద్రమును బ్రహ్మవిద్య అనెడి నావచే దాటించు సర్వజ్ఞుడు జ్ఞాన భాస్కరుడు అయిన సద్గురు మహనీయునికి నమస్కారము.

# గురు స్తోత్ర సుమాంజలి

(1)

బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం
ద్వంద్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాది లక్ష్యం|
ఏకం నిత్యం విమలమచలం సర్వధీసాక్షిభూతం
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి||

తా. పరమ సుఖదాయకమైన బ్రహ్మానందస్వరూపుడు, కేవలము మూర్తీభవించిన జ్ఞానస్వరూపుడు, రాగద్వేష, సుఖదుఃఖాది ద్వంద్వవికారాలకన్నింటికీ అతీతుడు, ఆకాశంలా దేనినీ అంటని విశాల స్వరూపుడు, తత్వమస్యాది వేదాంత మహావాక్యాలు ప్రబోధించే పరమాత్మ స్వరూపుడు, ఏకైక అద్వయానంద స్వరూపుడు, శాశ్వతమైనవాడు, స్వచ్ఛమైనవాడు, నిశ్చలస్వభావుడు, సర్వబుద్ధీంద్రియ వ్యాపారాలకూ అతీతుడు, మనోభావాలకు అందని వాడు, సత్వరజస్తమోగుణాలు మూడూ లేనివాడు అయిన సద్గురు మహనీయునికి నాహృదయ పూర్వక ప్రణామము లర్పిస్తున్నాను.

(2)

యస్యాంతర్నాదిమధ్యం నహికరచరణం
నామగోత్రం నసూత్రం,
నోజాతిర్నైవవర్ణం నభవతిపురుషో
నోనపుంసం నచస్త్రీ

నాకారంనోవికారం నహిజనిమరణం
నాస్తిపుణ్యం నపాపం,
నోతత్త్వం తత్త్వమేకం సహజసమరసం
సద్గురుం తం నమామి||

తా. ఆది మధ్యాంతరాలు, కరచరణాదులు (చేతులు, కాళ్ళు మొదలైన అవయవములు) లేనివాడు, నామము, గోత్రము, జాతి, వర్ణము ఇత్యాదులేవీ లేని వాడు, స్త్రీ పురుష భేద రహితుడు, ఆకార వికార శూన్యుడు, జనన మరణాదులులేని వాడు, పుణ్యపాపాలతో సంబంధము లేనటువంటివాడు, ద్వైతరహితుడు, సహజమైన, సమత్వమైన ఏకైక తత్వస్వరూపుడు అయిన సద్గురుమూర్తికి నమస్కారము.

(3)

గురుర్బ్రహ్మ గురుర్విష్ణు ర్గురుర్దేవో మహేశ్వరః |
గురుఃసాక్షత్ పరంబ్రహ్మ తస్మై శ్రీ గురవేనమః||

తా. గురువే బ్రహ్మస్వరూపుడు; గురువే విష్ణు స్వరూపుడు, గురువే మహేశ్వరుడు; గురువే సాక్షాత్తూ పర బ్రహ్మస్వరూపుడు; కావున అటువంటి మహనీయుడైన గురుమూర్తి కొరకు నమస్కరిస్తున్నాను.

(4)

చైతన్యం శాశ్వతం శాంతం వ్యోమాతీతం నిరంజనం |
నాదబిందు కళాతీతం తస్మై శ్రీగురవేనమః.||

తా. చైతన్య స్వరూపుడు; శాశ్వతమైనవాడు, శాంత స్వభావుడు; సర్వజగ ద్వ్యాపారాలకూ అతీతుడు; నిరంజనుడు; మనోబుద్ధీంద్రియాదులకు అందనివాడు; కావున అట్టి మహాత్ముడైన

గురు మూర్తికి నమస్కరిస్తున్నాను.

(5)

అజ్ఞానతిమిరాంధస్య జ్ఞానాంజన శలాకయా|
చక్షురున్మీలితంయేన తస్మై శ్రీగురవేనమః.||

తా. అజ్ఞానమనే చీకటి రోగంతో (తిమిరాంధకారం) బాధితులైన వారి నేత్రాలపైన జ్ఞానమనే కాటుక (అంజనము) పుడకతో పూసి వారికి అజ్ఞాన నివృత్తి కలుగజేసే వాడు కనుక అటువంటి అంధనిరోధకుడైన సద్గురు మూర్తికి ప్రణామములర్పిస్తున్నాను.

(6)

అఖండమండలాకారం వ్యాప్తంయేన చరాచరం|
తత్పదం దర్శితంయేన తస్మై శ్రీగురవేనమః||

తా. అఖండమైన ఆకారం కలవాడు; సకల చరాచర భూతాలయందూ వ్యాపించి యున్నవాడు; "తత్వమసి" (తత్+ త్వం+ అసి) అనే మహావాక్యంలోని తత్ పదలక్ష్యార్థమైనవాడు కావున అటువంటి గురుదేవుని పాదపద్మములు దర్శించుటకై ప్రణమిల్లు తున్నాను.

("తత్వమసి" అనే మహావాక్యానికి అర్థం అది నీవే అయి యున్నావని. అంటే, ఏ భగవంతుని కొరకు నీవు సాధనా తత్పరుడవై ఉంటున్నావో ఆ భగవత్ స్వరూపుడవు నువ్వే అయివున్నావు.)

(7)

స్థావరం జంగమం వ్యాప్తం యత్కించిత్సచరాచరం|
త్వంపదం దర్శితంయేన తస్మై శ్రీగురవేనమః||

తా. సమస్త స్థావర జంగమముల యందంతటా వ్యాపించి, చరాచర స్వరూపుడై భాసిస్తున్నవాడు, "తత్వమసి" (తత్ + త్వమ్ + అసి) అనే మహావాక్యంలోని త్వం పదలక్ష్యార్థమైనవాడు కావున అట్టి శ్రీ గురుమూర్తి పాదపద్మముల దర్శనార్థమై ప్రణామములర్పిస్తున్నాను.

(8)

చిన్మయంవ్యాపితం సర్వం త్రైలోక్యంసచరాచరం|
అసిత్వం దర్శితంయేన తస్మై శ్రీగురవేనమః||

తా. మూడు లోకాలలోగల సర్వ చరాచరములలో అంతటా చిన్మయస్వరూపుడై వ్యాపించియున్నవాడు; "తత్వమసి" (తత్ + తత్వం + అసి) అనే మహావాక్యంలోని అసిత్వం (అయివున్నావు) అనే పదలక్ష్యార్థమైనవాడు కావున అటువంటి శ్రీ గురునాథుని పాద దర్శనంకోసం ప్రణమిల్లుచున్నాను.

(9)

యత్సత్యేనజగత్సర్వం యత్ప్రకాశేనభాంతియత్|
యదానందేన నందంతి తస్మై శ్రీగురవేనమః||

తా. ఈ సర్వజగత్తూ ఎవనివల్ల సృష్టింప బడి, ఎవని తేజస్సు వలన ప్రకాశింపబడుతోందో, ఎవని విలాసంకొరకు భాసిస్తోందో అటువంటి శ్రీ గురుదేవునికి నమస్కారమర్పిస్తున్నాను.

(10)

నగురోరధికం తత్త్వం నగురోరధికం తపః|
నగురోరోరధికం జ్ఞానం తస్మై శ్రీగురవేనమః||

తా. గురువుకంటె మించిన తత్వం లేదు. గురు స్మరణకు మించిన తపంలేదు. గుర్వానుగ్రహానికి మించిన జ్ఞానంలేదు. అందువలన శ్రీ గురుదేవుని చరణారవిందములకు నమస్కరిస్తున్నాను.

(11)

గురురేకో జగత్సర్వం బ్రహ్మవిష్ణుశివాత్మకం|
గురోఃపరతరం నాస్తి తస్మాత్సంపూజయేద్గురుం||

తా. ఏకైక స్వరూపుడైన గురువే ఈ జగత్తంతా బ్రహ్మ, విష్ణు, శివ నామాలతో సర్వాత్మగా భాసిస్తూ ఉన్నాడు; గురు దేవునకు భిన్నమైన, విలక్షణమైన ఇతరమేదీలేదు. కనుక, అట్టి మహిమాన్వితుడైన గురుమూర్తినే సతతమూ పూజిస్తాను.

(12)

యస్యదేవేపరాభక్తిర్యధా దేవేతధాగురౌ|
తస్యైతేకధితాహ్యర్థాః ప్రకాశంతే మహాత్మనః||

తా. ఎవరికి పరాభక్తి ప్రసాదమైన స్వస్వ రూపమే అయివున్న భగవంతుని ప్రాప్తి కలగుతుందో, అలా సాక్షాత్కారమైన భగవత్ స్వరూపుడే గురువై ప్రకాసిస్తున్నాడు. భగవంతుని మీద, గురుని మీద దృఢమైన భక్తికలిగిన మహనీయుడికి, వేదాంత మహా వాక్యాల అర్థం అవగాహన అయి పరబ్రహ్మస్వరూపమే గురు స్వరూపంగా భాసిస్తుంది. వీరిరువురిదీ ఏకైక స్వరూపమనే జ్ఞానం ఉదయిస్తుంది.

[పరాభక్తి అనగా : ఆత్మ చింతన (స్వస్వరూపాను సంధానము) ఒక్కటే తప్ప, ఇక ఏ తలంపులూ లేక నిరంతరమూ ఆ చింతనలోనే నిమగ్నుడై ఉన్నవాడు ఆత్మాధీనుడౌతాడు. ఆత్మతో ఏకమై తన అహంకారభావాన్ని పోగొట్టుకుంటాడు. ఇలాంటి ఉన్నతమైన భక్తి జ్ఞానోత్పత్తికి దోహదమౌతుంది. తాను వేరైన భగవద్భక్తుడిననుకొనే

అంహకార భావం నశించిన వెంటనే, జ్ఞానోదయమైనదని అనుభవం కలుగుతుంది. దీనినే పరాభక్తి అంటారు. పరాభక్తీ, జ్ఞానము ఒకటే. భక్తుడూ, భగవంతుడూ (ధ్యాత, ధ్యేయము) ఏకమైన అద్వయానంద స్థితియే పరాభక్తి.]

(13)

మన్నాథః శ్రీజగన్నాథః మద్గురుః శ్రీజగద్గురుః|
మమాత్మా సర్వభూతాత్మా తస్మై శ్రీగురవేనమః||

తా. శ్రీజగన్నాథుడే నా హృదయేశ్వరుడై భాసిస్తున్నాడు. శ్రీ జగద్గురుడే నాకు గురువై ఉన్నాడు. సర్వభూతాలలో భాసిస్తూన్న పరమాత్మస్వరూపమే నా ఆత్మస్వరూపము. కనుక, అటువంటి సద్గురు చరణార విందములకు నమస్కృతులు.

(14)

ధ్యానమూలం గురోర్మూర్తిః
పూజామూలం గురోఃపదం|
మంత్రమూలం గురోర్వాక్యం
మోక్షమూలం గురోఃకృపా||

తా. ధ్యానానుష్ఠానానికి ఆధారం గురుదేవుని మూర్తి, పూజోపచారాలు ఆచరించడానికి నిలయం గురునాధుని పాదపద్మములు, మననం చేసుకోడానికి ఆలంబనం గురుమహోనీయుని ప్రబోధాలు. గురుకృపాకటాక్షాలు మోక్ష ప్రాప్తికి మూలం.

(15)

ఓం నమః శివాయ గురవే సచ్చిదానదంమూర్తయే|
నిష్ప్రపంచాయ శాంతాయ నిరాలంబాయ తేజసే||

తా. సత్ చిదానందమయుడు, ప్రపంచాదులకు అతీతుడు, పరమశాంతి స్వరూపుడు, ఉపాధిరహితుడు, శివస్వరూపుడు అయిన గురునాధునికి నమస్కారము.

## (16)

అజ్ఞానమూలం హరణం జన్మకర్మ నివారణం|
జ్ఞానవైరాగ్య సిద్ధ్యర్థం గురోఃపాదోదకంపిబేత్||

తా. అజ్ఞానబీజం హరించడానికి, పూర్వజన్మమందు, ఈజన్మ లోనూ చేసిన సంచిత, ప్రారబ్ధకర్మలు క్షయించడానికి, జ్ఞానవైరాగ్యాలు సిద్ధించడానికి గురుదేవుల యొక్క పాదోదకాన్ని త్రాగుతాను.

## (17)

నిత్యంశుద్ధం నిరాభాసం నిరాకారం నిరంజనం|
నిత్యబోధం చిదానందం గురుంబ్రహ్మ నమామ్యహం||

తా. నిత్యుడు, సుద్ధుడు, అగోచరుడు, నిరాకారుడు, నిరంజనుడు, బోధస్వరూపుడు, చిదానందుడు అయిన గురువు పరబ్రహ్మంతో సమానము.

## (18)

నిధయే సర్వవిద్యానాం భిషతేభవరోగిణాం|
గురవే సర్వ లోకానాం దక్షిణామూర్తయేనమః.

తా. సర్వ విద్యలకూ నిలయమైనవాడు, భవరోగములైన అజ్ఞానాహంకారాదులను పోగొట్టేవాడు, సర్వలోకాలయందూ భాసిస్తూ న్నవాడు అయిన గురువు సాక్షాత్తూ దక్షిణామూర్తే అయివున్నాడు. ఆటువంటి గురు మహనీయునికి నమస్కారము.

(19)

ఓం నమో బ్రహ్మాదిభ్యో బ్రహ్మవిద్యా సంప్రదాయ
కర్తృభ్యో వంశఋషిభ్యో మహద్భ్యో।
నమోగురుభ్యః సర్వోపప్లవరహితః ప్రజ్ఞాన
ఘనఃప్రత్యగర్థో బ్రహ్మైవాహమస్మి॥

తా. బ్రహ్మాదులకు, బ్రహ్మవిద్యా సంప్రదాయమునకు కర్తలు, ఋషివంశీయులు అయిన మహనీయులకు నమస్కారము. సర్వ అజ్ఞాన దోషరహితుడు, ప్రజ్ఞాన ఘనుడు, కేవలము తానే బ్రహ్మస్వరూపుడై భాసిస్తున్నవాడు అయిన గురుదేవునకు నమస్కృతులు.

(20) (21)

ఓం నారాయణం పద్మభవం వశిష్ఠం,
శక్తించ తత్పుత్ర పరాశరంచ।
వ్యాసం శుకం గౌడపదం మహాంతం.
గోవింద యోగీంద్ర మథాస్యశిష్యం।

శ్రీ శంకరాచార్య మథాస్య పద్మపాదంచ
హస్తామలకంచ శిష్యం।
తంత్రోటకం వార్తికకార మన్యా
సన్మద్గురూన్ సంతతమానతోఽస్మి॥

తా. నారాయణుడు, పద్మభవుడు, వశిష్ఠుడు, శక్తి, వానిపుత్రుడైన పరాశరుడు, వ్యాసుడు, శుక్రుడు, గౌడపాదుడు, మహాంతగోవిందయోగీంద్రుడు, వానిశిష్యుడైన శ్రీశంకరాచార్యుడు, వానిశిష్యులైన పద్మపాదుడు హస్తామలకుడు ఇత్యాది సమస్త సద్గురువరేణ్యులను సతతము భక్తితో స్మరిస్తూవుంటాను.

(22)

శ్రుతిస్మృతి పురాణానా మాలయం కరుణాలయం
నామామి భగవత్పాదం శంకరం లోకశంకరం॥

తా. శ్రుతులకు, స్మృతులకు, పురాణాదులకు ఆధార మైన వాడు, కరుణామయుడు, లోకములకు శుభములను కూర్చువాడు అయిన శంకర భగవత్పాదుల పాద పద్మములకు నమస్కృతులు.

(23)

శంకరం శంకరాచార్యం కేశవం బాదరాయణం।
సూత్రభాష్యకృతౌ వందే భగవంతౌ పునఃపునః॥

తా. బ్రహ్మసూత్ర భాష్యకారులు, శుభంకరులు, శంకరాచార్యుడు, కేశవుడు, బాదరాయణుడు వంటి భగవత్స్వరూపులకు పదేపదే వందనములర్పిస్తున్నాను.

(24)

ఈశ్వరో గురురాత్మేతి మూర్తిభేదవిభాగినే।
వ్యోమవద్వ్యాప్తదేహాయ దక్షిణామూర్తయేనమః॥

తా. ఈశ్వరుడు, గురువు, ఆత్మ అనేవి మూడు మూర్తులుగా విభజింపబడినట్లున్నా ఆమూర్తులు ఆకాశంలా దేహాదులన్నింటిలోనూ

వ్యాపించి ఉన్న - ఏకైక పరమాత్మ స్వరూపమే. అట్టి పరమ ః
స్వరూపమైన దక్షిణామూర్తికి నమస్కారము.

(25)

త్వమేవమాతాచ పితాత్వమేవ,
త్వమేవ బంధుశ్చసఖాత్వమేవ|
త్వమేవ విద్యాద్రవిణం త్వమేవ,
త్వమేవ సర్వం మమ దేవదేవ .

తా. ఓగురునాధా! నువ్వేనాతల్లివి, నువ్వేనాతం
నువ్వేనాకుబంధువుడవు, నువ్వేనాస్నేహితుడవు, నువ్వేనాకు
నువ్వేనాకు ధనము, నువ్వేనాకు సర్వస్వమూను. నా దేవదేవు
నువ్వే.

(26)

అన్యధా శరణం నాస్తి, త్వమేవ శరణం మమ|
తస్మాత్కారుణ్యభావేన, రక్షరక్ష మహేశ్వరః.

తా. ఓగురుదేవా! నేను నిన్నే శరణుజొచ్చాను. నువ్వు
వేరెవరూ నాకు శరణ్యులు అవరు. అందుచేత, ఓ మహేశ్వ
కరుణా కటాక్షములతో అనుగ్రహించి నన్ను రక్షించు. సంరక్షించ

గురుస్తోత్ర సుమాంజలి
సమాప్తం
ఓం తత్ సత్

వ్యాపించి ఉన్న - ఏకైక పరమాత్మ స్వరూపమే. అట్టి పరమ
స్వరూపమైన దక్షిణామూర్తికి నమస్కారము.

(25)

త్వమేవమాతాచ పితాత్వమేవ,
త్వమేవ బంధుశ్చసఖాత్వమేవ|
త్వమేవ విద్యాద్రవిణం త్వమేవ,
త్వమేవ సర్వం మమ దేవదేవ .

తా. ఓగురునాధా! నువ్వేనాతల్లివి, నువ్వేనాతం
నువ్వేనాకుబంధువుడవు, నువ్వేనాస్నేహితుడవు, నువ్వేనాకు
నువ్వేనాకు ధనము, నువ్వేనాకు సర్వస్వమూను. నా దేవదేవు
నువ్వే.

(26)

అన్యధా శరణం నాస్తి, త్వమేవ శరణం మమ|
తస్మాత్కారుణ్యభావేన, రక్షరక్ష మహేశ్వరః.

తా. ఓగురుదేవా! నేను నిన్నే శరణుజొచ్చాను. నువ్వు
వేరెవరూ నాకు శరణ్యులు అవరు. అందుచేత, ఓ మహేశ్వ
కరుణా కటాక్షములతో అనుగ్రహించి నన్ను రక్షించు. సంరక్షిం

గురుస్తోత్ర సుమాంజలి
సమాప్తం
ఓం తత్ సత్